


















నోరూరించే, మనసుదోచే పై మరపించే

పార్లే

పాపిన్స్

పండ్ల రుచిగల
పిప్పర మెంట్లు

PARLE POPPINS

5 పండ్ల సువాసనలలో
13 మధురమైన బిళ్ళలు
ప్రతి ప్యాక్‌లో నిమ్మ, మోసంబి,
నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరీ!

everest/507/PP Tel

## ప్రతి గ్రంధాలయంలోను ఉండితీరాలి!



శ్రీమతి మధురం భూతలింగం
రచించిన ఇంగ్లీషు పుస్తకాలు

**'SONS OF PANDU'**
Rs. 5-25

**'THE NECTAR OF THE GODS'**
Rs. 4-00

పిల్లలకు బహుమతిగా
ఇవ్వతగినవి.



కాపీలకు:

**డాల్టన్ ఏజన్సీస్**
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

---

## కేంబ్రిడ్జ్ విద్యార్థుల కోసం

క్రొత్తది! ఆశ్చర్యజనకం!! అసాధారణం!!!

## స్వాన్ కేంబ్రిడ్జ్ పెన్ను

బంగారు ప్లేటింగ్‌తో ఇరిడియం మొనగల పాళీ అత్యంత మెత్తగా వ్రాసేస్తుంది మరకలు పడకుండా... తేలికగా, నిరాఘాటంగా, అప్రయత్నంగా।

ఇతర విశిష్ట లక్షణాలు
- ఆకర్షణీయమైన ఆధునికమైన ఆకృతి
- చెక్కు చెదరని బంగారు రంగు కేప్
- 3 పద్ధతులలో, రెగ్యులర్, సెల్ఫ్ ఫిల్లింగ్ మరియు ఎయిరోమేటిక్
- ఎన్నుకొనుటకు ముచ్చటైన రంగులు అనేకం

శ్రేష్ఠమైన ఫలితాలకోసం
**స్వాన్** - డీలక్స్ ఇంకుతో వ్రాయండి.







**స్వాన్** (ఇండియా) ప్రైవేట్ లి.,
అద్వాని ఛాంబర్స్, పి. మెహతా రోడ్డు,
బొంబాయి-1 బి.ఆర్.
బ్రాంచి: 84బి, కన్నాట్ ప్లేస్, క్రొత్త ఢిల్లీ-1

heros'-SI-1148 TEL

"పెళ్లికి ప్రేమ పునాది కాదు, ప్రేమకు పెళ్లి జవాబు కాదు!"



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్

# పల్లెటూరి బావ

నిర్మాత: ఎ.వి.సుబ్బారావు
దర్శకత్వం: కె.ప్రత్యగాత్మ
సంగీతం: తాతినేని చలపతిరావు
మాటలు: భమిడిపాటి రాధాకృష్ణ

NVKR

నవయుగ

## సరిగ్గా ఆడాడు...

























49F-203R-TEL

ద్రోహాలు, దౌర్జన్యాలూ, దారిద్య్రం - జాతి జీవితానికే చీడపురుగులు.
వీటిని ఏరి పారెయ్యకపోతే మానవ మనుగడకే ముప్పు కలుగుతుంది




(KC) 16

తలనొప్పి లేక ఫ్లూబాధకు
అతిశీఘ్రంగా ఉపశమనం!

# శాలోఫెన్

## బాధానివారిణి మాత్రలు







శాలోఫెన్ తలనొప్పి, ఫ్లూ, పంటినొప్పి, ఒళ్లు నొప్పులకు అతి నిశ్చయంగా, శీఘ్రంగా ఉపశమనం కలిగిస్తుంది. ఇది నిరపాయకరమైనది. శాలోఫెన్ డాక్టర్లు సిఫారసుచేసే పటువైన ప్రక్రియ కలిగియుంది.




FDS/AS/1928 TEAR





# అమరచిత్రకథ

కనులపండుగ చేసే
రంగురంగుల అందాల
బొమ్మల కథలు.

నలదమయంతి • హరిశ్చంద్ర • శకుంతల
పంచపాండవులు • హనుమంతుని కథ
లవకుశులు • శ్రీరామకథ • సావిత్రి
బాలకృష్ణుడు • మహాభారతం







ఒక్కొక్కటి రు 1-50 మాత్రమే! అన్ని పుస్తకాల దుకాణాలలోనూ దొరుకుతాయి. లేకపోతే మాకు వ్రాసి తెప్పించుకోండి. పది పుస్తకాలూ ఒకేసారి తెప్పించుకుంటే పోస్టేజ్ ఉచితం!

ఇండియా బుక్ హౌస్
నారాయణగూడ, హైదరాబాదు. 500029




DAP



# చందమామ


సంస్థాపకుడు, నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'


ఈ నెల బేతాళకథ ["విజయ చిహ్నం"]కు ఆధారం "వసుంధర" పంపిన కథ.

జీవితంమీద విరక్తి పొందటమంటే తన జీవిత లంపటాలన్నిటి నుంచీ బయటపడటం. ఈ రహస్యం చాలా మంది విరాగులు గుర్తించక, వైరాగ్యం పొందిన అనంతరం కూడా పాత వాసనలతో బాధపడతారు. ఆ రహస్యాన్ని గుర్తించి, జీవితంతో తన ఆఖరు బంధాన్ని తెంచుకున్న వాడి కథ "ధనానికి ధనసహాయం."


సంపుటి 55 సెప్టెంబర్'73 సంచిక 3


CP

CHITRA



# అమరవాణి

నక్రః స్వస్థాన మాక్రమ్య గజేంద్ర మపి కర్షతి;
స ఏవ ప్రచ్యుతః స్థానాత్ శునాపి పరిభూయతే. 1

[మొసలి స్వస్థానంలో—నీటిలో—ఉండి పెద్ద ఏనుగును సైతం లాగేస్తుంది; అదే తన స్థానం నుంచి బయటపడి కుక్క చేత కూడా పరాభవం పొందుతుంది.]

నీచాశ్రయో న కర్తవ్యః. కర్తవ్యో మహదాశ్రయః;
ఈశాశ్రయో మహానాగః ప్రప్రచ్ఛ గరుడం సుఖమ్. 2

[నీచులను ఆశ్రయించటం తగదు; గొప్పవారినే ఆశ్రయించాలి. ఈశ్వరుణ్ణి ఆశ్రయించిన మహాసర్పం గరుత్మంతుణి, "క్షేమమా?" అని అడిగిందట!]

యాత్యేకతో స్తశిఖరం పతి రోషధీనాం,
ఆవిష్కృతో రుణపురస్సర ఏకతోర్కః,
తేజోద్వయస్య యుగప ద్వ్యసనోదయాభ్యాం
లోకోనియమ్యత ఇవాత్మదశాంతరేషు (కాళిదాసు) 3

[ఒక పక్క (పున్నమి) చంద్రుడు అస్తమించుతున్నాడు. మరొక పక్క అరుణుడితో సహా సూర్యుడు ఉదయిస్తున్నాడు. ఒక గొప్పవాడు పడిపోతూ ఉంటే మరొక గొప్పవాడు పైకి రావటం లోకం తీరు అని తెలుస్తున్నది.]

లోకం తీరు



ఒక అగ్రహారంలో శ్రీదేవమ్మ అనే ఆమెకు ఇద్దరు కొడుకులు. పెద్దవాడు రామయ్య. చిన్నవాడు శీనయ్య. శీనయ్యకు ఎడమకాలు చచ్చుపడిపోయింది. అతను కర్ర సహాయంతో నింపాదిగా మాత్రమే నడవగలడు. తన చిన్నకొడుకు స్వశక్తితో పొట్టపోసుకో లేడని శ్రీదేవమ్మ దిగులుపడేది.

ఆ దిగులుతోనే ఆమె మంచం పట్టింది. ఒకనాడు ఆమె రామయ్యతో, "నాయనా, శీనడి భారం నీదేరా! వాణ్ణి ఎలాచూస్తావో ఏమో?" అని కన్నీరు కార్చింది.

రామయ్య తల్లి కన్నీరు చూడలేక కళ్ళు మూసుకుని, "అలాగే నమ్మా, వాడికి ఏలోటూ రానియ్యను," అని తల్లికి మాట ఇచ్చాడు. ఈ మాట వింటూనే శ్రీదేవమ్మ సంతోషంగా ప్రాణాలు వదిలింది.

అన్నదమ్ములకు ఇప్పుడు కాచిపోసే వారు లేరు. రామయ్యను పెళ్ళి చేసుకోమని ఇరుగు పొరుగు వాళ్ళు సలహా ఇచ్చారు. వారి సలహా పాటించి రామయ్య కనకమ్మ అనే ఆమెను పెళ్ళాడాడు.

కాపరానికి వచ్చినది మొదలు కనకమ్మకు శీనయ్య అంటే చిరాకు ఏర్పడింది. తన భర్త కష్టపడి సంపాదించి తెస్తుంటే శీనయ్య తేరగా తింటూ కూర్చుంటున్నాడని ఆమె సూటి పోటి మాటలు అనేది. శీనయ్య వాటిని భరించేవాడే గాని, అన్నతో చెప్పేవాడు కాడు.

రాను రాను కనకమ్మకు శీనయ్యంటే అసహ్యం జాస్తి అయింది. ఆమె ఒకనాడు శీనయ్యతో, "ఇంటి పట్టున కుక్కలాగా బతక్కపోతే ఎటయినా పోరాదూ?" అన్నది.

శీనయ్యకు దుఃఖం ఆగలేదు. కాని అతన్ని ఓదార్చేవారెవరూ లేరు. అతనికి ఇంటి మీద రోత పుట్టింది. వదినెగారు పెట్టే అన్నంతో అతనికి ఆకలి కూడా తీరటం

కయిపు ఆదిశేషారెడ్డి

లేదు. భగవంతుడి మీద భారం వేసి, ఒక నాటి రాత్రి ఎవరికీ తెలియకుండా అతను ఇల్లు వదిలి బయలుదేరాడు.

శీనయ్య కర్ర ఊతతో నడుస్తూ, కూర్చుంటూ, దారిలో ఏ ఆకో, కాయో తింటూ నాలుగు రోజులు నడిచి రాజు గారుండే నగరం చేరాడు. అతను అక్కడికి చేరేసరికి బాగా చీకటి పడింది. మర్నాడు రాజుగారి దర్శనం చేసుకుని, ఆయనను యాచించి ఏదైనా పుచ్చుకుందా మనుకుని శీనయ్య ఆ రాత్రి ఒక అరుగు మీద పడు కుని నిద్రపోయాడు.

ఆ నిద్రలో అతనికి ఒక కల వచ్చింది.

ఆ కలలో శీనయ్యకు అవిటి కాలులేదు. పైగా అతనివద్ద చాలాడబ్బు కూడా ఉన్నది. అతను పడుకుని నిద్రపోతూండగా నలుగురు దొంగలు వచ్చి, కత్తిచూపి అతన్ని భయపెట్టి, అతనివద్ద ఉన్న డబ్బంతా తీసుకుని వెళ్ళిపోతున్నారు. అప్పుడతను, "దొంగలు! దొంగలు!" అని గట్టిగా అరిచాడు.

శీనయ్య ఆ కేకలు పైకే పెట్టి, తన కేకలకు తానే మేలుకున్నాడు. అతను కేకలు పెట్టిన సమయంలో పక్కనున్న జమీందారు ఇంట్లో నిజంగానే ఒక దొంగ ప్రవేశించి ఉన్నాడు. తనను ఎవరో కనిపెట్టారని వాడు భయపడి వీధిలోకి జారుకున్నాడు.

ఈ లోపల, శీనయ్య పెట్టిన కేకలకు లేచి బయటికి వచ్చిన జనం దొంగను కాస్తా పట్టుకున్నారు. వాళ్ళు ఆ దొంగనూ, వాణ్ణి పట్టేందుకు సహాయపడిన శీనయ్యనూ రాజ సభకు తీసుకుపోయారు.

వాళ్ళు రాజుగారికి శీనయ్యను చూపి, "ఇతనే దొంగను చూశాడు. పాపం, కుంటి వాడు కావటంచేత తాను దొంగను పట్టలేక, కేకలు పెట్టాడు," అని చెప్పారు.

రాజు శీనయ్య సంగతి అంతా అతని ద్వారా తెలుసుకుని, రామయ్యనూ కనకమ్మనూ పిలిపించి, శీనయ్యను సరిగా చూడనందుకు వారిని మందలించి, శీనయ్యకు డబ్బు ఇచ్చి, అతన్ని అన్న వెంట తిప్పి పంపేశాడు.





# యక్షపర్వతం

## 16

[బిలదుర్గంలో ప్రవేశించిన తోడేళ్ళను చూసి, గురుభల్లూకుడి అనుచరులందరూ భయకంపితులై పోయారు. ఖడ్గజీవదత్తులు బిలంలోకి పోయి, వృకేశ్వరీదేవి ఆజ్ఞాపించినట్టుగా, గురుభల్లూకుణ్ణి అరణ్యంలోకి పొమ్మన్నారు. వాడు అరణ్యంకేసి బయలుదేరాడు. ఆ సమయంలో ఆకలిగొన్న తోడేళ్ళు అతడి వెంటబడినై. తరవాత—]

గురుభల్లూకుడి చావు కేకలూ, తోడేళ్ళ అరుపులూ విన్న ఖడ్గ జీవదత్తులూ, వాళ్ళ వెంట వున్న సమరబాహూ, చందూలు త్వర త్వరగా బిలం పైకి వచ్చారు. వాళ్ళకు అరణ్యం కేసి పారిపోతున్న ఎలుగ్గొడ్డు ముఠావాళ్ళూ, వాళ్ళకు కొంచెె వెనకగా పరిగెత్తుతున్న గురుభల్లూకుడూ, వాణ్ణి పట్టుకునేందుకు వెంట తగిలిన తోడేళ్ళూ కనిపించినై.

ఖడ్గవర్మ ఆ దృశ్యం చూస్తూనే కొంచెం ఆశ్చర్యపోయి, "నాలుగు తోడేళ్ళను ఎదుర్కొని చంపలేక అంత మంది వృకేశ్వరీ భక్తులు కాలి సత్తువ కొద్దీ పరిగెత్తుతూండటం నవ్వు తెప్పిస్తున్నది," అన్నాడు.

"నీ కిదంతా నవ్వుగా వున్నదేమో కాని, ఆ గురుభల్లూకుడికి మాత్రం ప్రాణాంతకంగా వున్నట్టు కనబడుతున్నది! వాణ్ణి తోడేళ్ళు కండకు కండ చీల్చి చంపటం



చూస్తూ మనం యిక్కడ నిలబడటం అన్యాయం. నువ్వు గురిచూసి బాణాలు కొట్టి, ఆ తోడేళ్ళను చంపటమో, లేక బెదిరి పారిపోయేలా చేయటమో చెయ్యి," అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ బాణం ఎక్కుపెట్టి, అన్నిటి కన్న వెనక వున్న తోడేలుకు గురిచేసి కొట్టాడు. బాణం రివ్వుమంటూ పోయి డొక్కలో బలంగా తగలగానే తోడేలు పెద్దగా అరుస్తూ, గాలిలోకి ఎగిరి దభీమంటూ కింద పడి, గిలగిలా తన్నుకో సాగింది. అది చూసిన మిగతా తోడేళ్ళలో ఒకటి చప్పున వెనుదిరిగి వచ్చి, తోడేలు మీదపడి, పీక్కు తినటం ప్రారంభించింది.

ఖడ్గవర్మ మరొక బాణం ఎక్కుపెట్ట బోయేంతలో సమరబాహు అయిష్టంగా తలాడిస్తూ, "అయ్యా, ఆ తోడేళ్ళను చంపటం ఎందుకు? ఆ గురుభల్లూకుణ్ణీ, వాడి ముఠావాళ్ళనూ అవి గొంతులు కొరికి చంపితే అందరి పీడావదిలి పోతుంది గదా," అన్నాడు.

"సమరబాహూ! ఈ భల్లూకుడూ, వాడి ముఠా చచ్చినంత మాత్రానే అందరి పీడా విరగడయితే, యిక లేనిదేమిటి? ఒక మహా కార్యం నిర్వహించేందుకు వింధ్యపర్వతాల కేసి బయలుదేరిన మేము, దారి పొడుగునా యిలాంటి పీడల్ని చూస్తూనే వస్తున్నాం," అని, జీవదత్తుడు ఖడ్గవర్మతో, "యిక్కడ నిలబడి లాభంలేదు. గురు భల్లూకుణ్ణి తోడేళ్ళనుంచి కాపాడి అరణ్యం లోని కొలను కేసి పరిగెత్తిన వాడి శిష్యగణానికీ, వాడికీ యింత ధర్మబోధ చేసి మన దారిన మనం పోదాం!" అంటూ భల్లూకుడి కేసి పరిగెత్త సాగాడు. తతిమ్మా వాళ్ళందరూ అతణ్ణి అనుసరించారు.

జీవదత్తుడు సమీపంలోకి రావటం చూస్తూనే తోడేళ్ళు మూడూ కసిగా కోరలు చాచి, పెద్దగా ఓసారి అరిచి, అరణ్యం కేసి పరిగెత్తినై. పారిపోతున్న గురుభల్లూకుణ్ణి, జీవదత్తుడు గట్టిగా కేకవేసి, "ఒరే, భల్లూకం బాబూ! కిందూ మీదూ చూసుకో

కుండా అలా పరిగెత్తి కాళ్ళూ, చేతులూ విరగ్గొట్టుకునేవు; నీ కొచ్చిన ప్రాణభయ మేంలేదు, ఆగు!'' అన్నాడు.

గురుభల్లూకుడు ఆ హెచ్చరిక వింటూనే ఆగి, వెనక్కి తిరిగి చూశాడు. వాడికి శత్రువుల నుంచి పారిపోలేననీ, శరణువేడితే ప్రాణరక్షణ జరగవచ్చునీ ఆశ కలిగింది. జీవదత్తుడూ, అతడి అనుచరులూ దగ్గిరకు రాగానే వాడు రెండు చేతులూ జోడించి నమస్కరిస్తూ, "అయ్యా, నన్ను చంప కండి. చేసిన పాపాలకు ఎలాంటి ప్రాయ శ్చిత్తం చేసుకోమన్నా చేసుకుంటాను,'' అన్నాడు.

"ప్రాయశ్చిత్తంతో నీ పాపాలు పరిహారం అయిపోతవో లేదో నాకు తెలియదుగాని, లోగడ నీ చేతుల్లో చచ్చిన వాళ్ళెవరూ తిరిగి బతికిరారు గదా? ఇంతకూ నువ్వు యీ అరణ్యంలో ఏ వ్యవసాయమో చేసుకుని జీవించక యీ తోడేళ్ళ పెంపకం, వృకేశ్వరీ ఉపాసనలూ ఎందుకు ప్రారం భించావు?'' అని అడిగాడు జీవదత్తుడు.

"నలుగురి మీదా అధికారం చెలా యిస్తూ సుఖంగా బతకాలంటే యింతకన్న మంచి మార్గం నాకేమీ కనిపించలేదు, దొరా. మీరిక్కడికి వచ్చేవరకూ నాకు అంతా హాయిగానే జరిగిపోయింది. ఆ తర వాత వృకేశ్వరీదేవి ఎందువల్లనో నన్ను



చిన్న చూపు చూసింది,'' అన్నాడు గురు భల్లూకుడు నిరుత్సాహంగా.

"మరైతే నువ్విప్పుడు ఏం చేయబో తున్నావ్? నీ శిష్యగణమంతా నిన్ను తోడేళ్ళకు వదిలి అరణ్యంలోకి పారిపోయి నట్టుందే!'' అన్నాడు ఖడ్గవర్మ.

"దొరా, నా శిష్యులెవరూ నన్నొదిలి పారి పోలేదు. వాళ్ళు అరణ్యంలోని కొలను దగ్గిర వెలవనున్న వృకేశ్వరీదేవిని పూజిం చేందుకు వెళ్ళారు. ఆ దేవి యింతకు ముందే బిలదుర్గంలో నుంచి అంతర్థానమై పోయింది,'' అన్నాడు గురుభల్లూకుడు.

"సరే, అక్కడికే పోదాం పద. ఆ దేవి నీకు ఎలాంటి శిక్ష యివ్వమంటుందో అడిగి



చూస్తాను," అంటూ జీవదత్తుడు ముందుకు కదిలాడు.

అందరూ కలిసి కొంతదూరం నడిచి అరణ్యాన్ని సమీపించ బోయేంతలో చెట్ల చాటు నుంచి కొందరు ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళు కేకలు పెడుతూ వాళ్ళకేసి పరిగెత్తుకు రాసాగారు. వాళ్ళల్లో ముందు వస్తున్న వాళ్ళు, తమ గురువుతోపాటు వున్న ఖడ్గ జీవదత్తుల్ని చూస్తూనే భయకంపితులై పోయి, పారిపోబోయేంతలో గురుభల్లూకుడు వాళ్ళను కేకవేసి, "మనకొచ్చిన ప్రాణ భయం ఏమీలేదు. వృకేశ్వరీ కృప వల్ల యీ దొరలు మనకెలాంటి హానీ చెయ్యమని అభయం యిచ్చారు," అన్నాడు.

తమ గురువు అలా చెప్పగానే పారిపోయి వస్తున్న ఎలుగ్గొడ్డు వాళ్ళలో నలుగురు ఖడ్గజీవదత్తులున్న చోటుకు వచ్చి, తమ గురువువైన భల్లూకుడితో, "గురుభల్లూకా! అరణ్యంలోని కొలను దగ్గిర అయిదారుగురు ఒంటెల వాళ్ళున్నారు. వాళ్ళ నాయకుడైన స్వర్ణాచారి అనే వాడు మనవాళ్ళలో ఇద్దర్ని చంపి, ఐదుగుర్ని చుట్టుముట్టి పట్టుకున్నాడు. మేం వాళ్ళకు దొరక్కుండా, యీ దుర్వార్త మీకు చెప్పేందుకు పారిపోయి వచ్చాం," అని చెప్పారు.

స్వర్ణాచారి పేరు వింటూనే ఖడ్గజీవదత్తులూ, సమరబాహూ పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. ఎక్కడో కొండ మీద కోట కట్టే ప్రయత్నాల్లో వున్న స్వర్ణాచారి నలుగురైదుగురు అనుచరుల్ని వెంట బెట్టుకుని, ఇక్కడి కొలను ప్రాంతానికి ఎందుకొచ్చినట్టు?

సమరబాహును శత్రువుల నుంచి రక్షించి తీసుకు వస్తామని వాగ్దానం చేసి ఖడ్గజీవదత్తులు బయలుదేరి అరణ్యంలోకి వచ్చిన తరవాత, అక్కడ స్వర్ణాచారి వుంటున్న కొండప్రాంతాల పెద్ద గంద్రగోళం జరిగింది. ఆ ప్రాంతాలన్నిటినీ వీరసింహుడనే రాజు పరిపాలిస్తున్నాడు. అతడి రాజధానీ నగరమైన వీరపురానికీ, స్వర్ణాచారి కోట కడుతున్న కొండప్రాంతాలకూ మధ్య

పెద్ద అరణ్యం వున్నది. వీరసింహుడు ఆ అరణ్యంలో నివశిస్తున్న అన్ని రకాల అడవిజాతి మనుష్యుల మీదా తనదే ఆధిపత్యం అనుకుంటూండే వాడు. అప్పుడప్పుడూ వాళ్ళ మీద దాడులు చేసి, వాళ్ళ నుంచి కప్పంగా జంతుచర్మాలూ, వాళ్ళు తినే వెదురుబియ్యం, కాయా కసవులూ వసూలు చేస్తూండే వాడు. ఇలాంటి పద్ధతుల ద్వారా తాను, ఆ అడవి జాతుల కన్నిటికీ ప్రభువైనట్టు వాళ్ళకు గుర్తు చేస్తున్నానని ఆత్మతృప్తి పొందేవాడు.

వీరసింహుడికి ఆ మధ్య చారుల ద్వారా అరణ్యంలోని కొండ ప్రాంతాలకు ఒంటెలు వాహనాలుగా గల వాళ్ళు కొందరు వచ్చారని తెలిసింది. తరవాత కొన్నాళ్ళకు ఎలుగుబంటి చర్మాలు ధరించే ముఠా ఒకటి అరణ్యంలోని ఒక పెద్ద బిలాన్ని ఆక్రమించి, ఆ చుట్టుపక్కల తిరిగే మనుషుల్ని బానిసలుగా పట్టుకుని, వెట్టి చాకిరీ చేయించు కుంటున్నారన్న వార్త అందింది.

వీరసింహుడు మొదట్లో యీ ఒంటెల వాళ్ళను గురించీ, ఎలుగ్గొడ్డు ముఠాను గురించీ అంతగా పట్టించుకోలేదు. అరణ్యంలో ఆ రెండు ముఠాలూ ఒకళ్ళ నొకళ్ళు హతంచేసు కుంటారనీ, అంతగా గెలిచిన వాళ్ళు బలవంతులైతే, వాళ్ళ



సంగతి అప్పుడు చూడవచ్చునీ పూరుకున్నాడు.

వారం రోజుల క్రితం వీరసింహుడి జంతు ప్రదర్శన శాలాధికారి పది మంది సైనికులను వెంట బెట్టుకుని జంతుశాలకు కొత్త మృగాలను పట్టుకు వచ్చేందుకు అరణ్యానికి వచ్చాడు. వాళ్ళు వలలువేసీ, బోన్లు పెట్టీ కొన్ని అడవి పక్షులనూ, పులులనూ పట్టుకుని మధ్యాహ్నం వేళ ఒక వాగు ఒడ్డున విశ్రాంతిగా కూర్చుని భోజనాలు చేస్తున్నారు.

రాజుగారి సైనికుల్లో ఒకడు అందరికన్న ముందుగా భోజనం ముగించి, ఎండ వేళప్పుడు చెట్లకొమ్మల్లో, ఏవైనా వింత



పక్షులు కనబడతవేమో అని చెట్ల కిందుగా నడుస్తూ, అరణ్యంలో కొంత దూరం పోయాడు. వాడికి హఠాత్తుగా ఒక చోట చెట్లకు కట్టివున్న నాలుగు ఒంటెలు కనిపించినై.

ఆ సైనికుడు ఒంటెలను గురించి విన్నాడేగాని, ఎన్నడూ చూసి వున్నవాడు కాదు. ఆ జంతువు లెక్కడో ఎడారి ప్రాంతాల వుంటవని వాడను కున్నాడు. కాని, అవి వీరపుర రాజ్యపు అరణ్యాల్లో కనబడే సరికి, వాడు ఆనందాశ్చర్యాలతో కింద మీదైపోతూ వాగు దగ్గిరకు పరిగెత్తుకు వచ్చి, జంతు ప్రదర్శన శాలాధికారితో ఆ శుభవార్త చెప్పాడు.

"ఒంటెలా! ఏవీ? ఎక్కడ? మన ప్రదర్శనశాలలో లేనివి ఉష్ట్రమూ, ఉష్ట్ర పక్షీ మాత్రమే. ఒక ఉష్ట్రమూ, ఉష్ట్రికా వుంటే మన రాజుగారి కెంత కీర్తి! రాజ్యాని కెంత పేరు!" అంటూ ఉత్సాహం పట్టలేక వడవడ వణకసాగాడు.

ఆ మాటలకు ఒంటెలను చూసి వచ్చిన సైనికుడు కాస్త నిరుత్సాహపడి, "అయ్యా, ఆ ఒంటెలు నాలుగూ తాళ్ళతో చెట్లకు కట్టి వేయబడివున్నవి. ఆ మాట చెప్పాను, మీరు సరిగా విన్నట్టులేదు. వాటికి యజమాను లెవరో వున్నట్టుంది," అన్నాడు.

"యజమాను లుంటే మనకేం? ఈ వీరపుర రాజ్యంలో వున్న ప్రజలకూ, అరణ్యాలకూ, నీటికీ, గాలికీ—ఒక్కమాటలో రాజ్యం పైన విస్తరించి వున్న ఆకాశాని కూడా యజమాని మన వీరసింహ మహారాజులుంగారు. తెలిసిందా? మీలో ఇద్దరు ముగ్గురుపోయి ఆ ఒంటెలను యిక్కడికి తోలుకురండి. వాటి యజమానులన్నావే; వాళ్ళు కనిపిస్తే, వాళ్ళను కూడా యిక్కడికి వచ్చి నా దర్శనం చేసుకోమనండి," అన్నాడు జంతుశాలాధికారి.

సైనికులకు భయంగా వున్నా, తమ పైఅధికారి ఆజ్ఞ నిర్వహించక తప్పదు గనక, నలుగురు బయలుదేరి ఒంటెలున్న చోటుకు వెళ్ళారు. ఒంటెలు ఎప్పటిలాగే

చెట్లకింద పచ్చికమేస్తూ కనిపించినై. దగ్గిర్లో ఎక్కడా వాటి యజమానులున్న సూచనలు కనబడలేదు. సైనికులు ధైర్యంగాపోయి చెట్లకు కట్టివున్న వాటి తాళ్ళను ఊడదీయబోయారు. ఆ సమయంలో కొత్తమనుషుల్ని చూసి భయపడిన ఒక ఒంటె వికృతంగా సకిలించి, వెనక కాళ్ళతో చెట్లబోదెలను తన్నుతూ గడబిడ ప్రారంభించింది. దాన్ని చూసి తతిమ్మా ఒంటెలు కూడా గొడవ చేయసాగినై.

ఉదయానే అరణ్యానికొచ్చి, బాగా ఎండ ఎక్కేవరకూ వేటాడి అలసిపోయిన సమరబాహు అనుచరులు నలుగురు ఆ దాపుల్లోనే వున్న ఒక నీటి కొలను దగ్గిర, చెట్ల నీడలో కూర్చుని విశ్రాంతి తీసుకుంటున్నారు. వాళ్ళకు ఒంటెలు చేస్తున్న గోల వినబడింది. ఏ సింహమో, పులో వచ్చి వాటి మీద పడివుంటుం దనుకుంటూ వాళ్ళు కత్తులు దూసి పరుగు పరుగున ఒంటెలున్న చోటుకు వచ్చారు.

ఒంటెల తాళ్ళు విప్పుతున్న రాజ సైనికులు చెట్లవెనక నుంచి వస్తున్న అడుగుల చప్పుడు విని తలలెత్తి చూశారు. వాళ్ళకు కత్తులు పైకెత్తి వేగంగా వస్తున్న సమరబాహు అనుచరులు కనిపించారు. వెంటనే సైనికులు కూడా కత్తులు దూసి, కొంచెం వెనక్కుపోయి నిలబడ్డారు.



సమరబాహు అనుచరుల్లో ఒకడు కోపంతో పళ్ళుకొరుకుతూ, "ఎవ్వరా మీరు ? సైనిక దుస్తులు వేసుకున్న దారి దొంగల్లావున్నారు! ఒంటెలను అపహరించటం మీ బోటి అల్పులవల్ల అయేపనేనా? " అన్నాడు.

"మేం దారిదొంగలం కాదు, వీరసింహ మహారాజుగారి సైనికులం. మీ ఒంటెలను అపహరించుకు పోవటం లేదు; పుల్లరి కట్టకుండా రాజుగారి అరణ్యంలో మేపుతున్నందుకు వాటిని బందెలదొడ్డికి తోలుకు పోతున్నాం," అన్నాడొక తెలివైన సైనికుడు.

"ఎవరా వీరసింహ మహారాజు? ఇక్కడ అధికారమంతా సమరబాహు మహారాజుగారిదే, తెలిసిందా? వారి ఒంటెలను

దొంగిలించటానికి వచ్చిన మిమ్మల్ని విచారించి శిక్షించుతాం. ఆయుధాలు కింద పడవేసి లొంగిపోండి!" అంటూ సమరబాహు అనుచరులు ముందుకురికారు.

పారిపోయే అవకాశం లేదని తెలుసుకున్న వీరసింహుడి సైనికులు వాళ్ళను ఎదిరించారు. అప్పుడు జరిగిన కత్తి యుద్ధంలో ఇద్దరు రాజసైనికులు చచ్చారు, ఒకడు గాయపడ్డాడు, నాలుగో వాడు ఎలాగో సమరబాహు అనుచరులకు అందకుండా, కాలి సత్తువకొద్దీ పరిగెత్తి వాగు ఒడ్డున వున్న జంతుప్రదర్శనశాలాధికారిని చేరాడు.

శరీరం మీద అక్కడక్కడా నెత్తురు మరకల్తో, ఆయాసపడుతూ తన దగ్గిరకు పరిగెత్తుకొస్తున్న సైనికుణ్ణి చూస్తూనే జంతుప్రదర్శనశాలాధికారి, "ఇది వింతగా వుందే! నేను చదివిన జంతుశాస్త్రంలో ఎక్కడా ఒంటెలు మాంసాహారులని లేదు. ఆశ్చర్యం! నీ వెంట వచ్చిన తతిమ్మా ముగ్గుర్నీ అవి చంపి తినేసినయ్యా?" అని అడిగాడు.

"అయ్యా, ఒంటెలు కాదు, వాటి యజమానులు నన్నిలా గాయపరిచారు. నా వెంట వచ్చిన ముగ్గురూ వాళ్ళ కత్తులకు బలైపోయారు. వాళ్ళెవరోగాని కత్తి తిప్పటంలో ఆరితేరిన ఘటాల్లా వున్నారు." అన్నాడు సైనికుడు.

"మన కన్న కత్తియుద్ధంలో మొనగాళ్ళు యీ లోకంలో వున్నారంటే నేను నమ్మను," అంటూ జంతుప్రదర్శనశాలాధికారి కత్తి దూసి నిలబడ్డాడు. అతడితోపాటు మిగతా సైనికులు కూడా నిలబడ్డారు.

గాయపడి వచ్చిన సైనికుడు, తాను పారిపోయి వచ్చిన దిక్కుకేసి తలతిప్పి చూసి, తమ కేసి వస్తున్న సమరబాహు సైనికులు కళ్ళబడగానే, "అయ్యా, మీ అనుమానమేదో త్వరలోనే తీరిపోతుంది. అరుగో, వాళ్ళిటే వస్తున్నారు!" అన్నాడు.

జంతుప్రదర్శనశాలాధికారి తన పక్కన వున్న సైనికులను హెచ్చరించి, కత్తి పైకెత్తి, సమరబాహు అనుచరులకేసి బయలుదేరాడు. —(ఇంకావుంది)






# విజయ చిహ్నం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు పడుతున్న శ్రమ అపూర్వమైనదే గాని, ఇంతకన్న కష్టసాధ్యమైనది ప్రజలను సక్రమంగా పాలించటం. ఇందుకు నిదర్శనంగా నీకు ఒక యువనరాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్ప సాగాడు :

పూర్వం యువనదేశంలో ఒక మంచి రాజ్యం ఉండేది. ఆ దేశాన్ని ఏలే యువన రాజు ఆదర్శప్రభువు అని చెప్పుకునేవారు. ఆయన పాలనలో ప్రజలు ఎలాటి బాధలూ లేక సుఖంగా జీవిస్తూవచ్చారు.

ఆ రాజుకు ఇద్దరు కొడుకులు. తన అనంతరం కూడా ప్రజాపాలన తన కాలంలో

## బేతాళ కథలు



జరిగినట్టే ఆదర్శప్రాయంగా జరిగిపోవాలని ఆయనకు కోరిక ఉండేది. తన ఇద్దరు కొడుకులలో ఎవరు తన స్థానం ఆక్రమించటానికి అర్హుడో తెలుసుకోగలందులకు ఆయన ఒక విచిత్రమైన ఆలోచన చేశాడు. తాను జీవించి ఉండగానే తన కొడుకులకు రాజ్యపాలన చేసే అవకాశం ఇచ్చి, తమకు ఇష్టమైన వాణ్ణి ప్రజలే ఎన్నుకునేటట్టు ఆయన ఒక అపూర్వమైన ఏర్పాటు చేశాడు. ఏటా రాజుకు ఎన్నికలు జరుగుతాయి. రాజకుమారులిద్దరూ ఎన్నికలకు నిలబడతారు. ఎన్నికలకు ముందు, యుక్త వయస్కులైన ప్రజలందరికీ రాజు ముద్ర గల పత్రాలు పంచుతారు. ఎన్నికల రోజున ప్రతి గ్రామంలోనూ రెండు పెట్టెలుంచుతారు. వాటిలో ఒక పెట్టె పెద్ద రాజకుమారుడిది, రెండోది చిన్న రాజకుమారుడిది. ప్రజలు రహస్యంగా తమ ఎన్నికల పత్రాలను ఏదో ఒక పెట్టెలో వేస్తారు.

అయితే ఏ పెట్టె ఎవరిదో తెలియటానికి గాను ఒక పెట్టె మీద ఒక రాజకుమారుడి చిహ్నం ఏర్పాటు చేస్తారు. ఆ దేశపు చిహ్నం సింహం. మొదటిసారి ఎన్నికలలో సింహం గుర్తు పెద్ద రాజకుమారుడి పెట్టెకు ఉంచబడింది.

ఎన్నికలకు ముందు కొద్ది రోజుల పాటు దేశం నలుమూలలా తిరిగి ప్రజలలో ప్రచారం చేసుకోవటానికి రాజు తన కుమారులకు అనుమతి ఇచ్చాడు.

పెద్దవాడు, ప్రజలు తనను ఎన్నుకున్నట్టయితే, వ్యవసాయానికి నీటి వనరులు పెంపు చేయటానికి కాలువలూ, చెరువులూ తవ్విస్తాననీ, పేదలకు జీవనోపాధులు కలిగిస్తాననీ, ఊరూరా వైద్యశాలలూ, పాఠశాలలూ పెట్టిస్తాననీ, తన తండ్రి అడుగు జాడలలో నడుస్తాననీ ప్రజలకు వాగ్దానాలు చేశాడు.

రెండవవాడు శత్రురాజులను నిర్మూలిస్తాననీ, రాజ్యాన్ని విస్తరింప జేస్తాననీ, తన దేశానికి ప్రపంచఖ్యాతి సంపాదిస్తాననీ వాగ్దానాలు చేశాడు.

ఎన్నికల అనంతరం, ఎన్నికలపత్రాలను లెక్కించగా అధికసంఖ్యాకు లైన ప్రజలు రాజుగారి పెద్ద కొడుకునే అభిమానించినట్టు స్పష్టమయింది.

"మీరు సింహం గుర్తును నా పెట్టెకే తగిలించి ఉంటే నన్నే ప్రజలు రాజుగా ఎన్నుకునే వాళ్ళు. ఆ గుర్తు మూలంగా అన్న గెలిచాడు," అని చిన్నవాడు తండ్రితో అన్నాడు.

"పిచ్చివాడా, గుర్తులో ఏ మున్నది? నీ అన్న చేసిన వాగ్దానాలు ప్రజలకు నచ్చాయి. అందుచేత అతన్ని వాళ్ళు తమ రాజుగా ఎన్నుకున్నారు. కావలిస్తే వచ్చే ఏడు సింహం చిహ్నాన్ని నువే తీసుకో," అన్నాడు రాజు.

ఒక ఏడాదిపాటు పెద్దవాడు రాజ్యం చేశాడు. ఎన్నికల సమయంలో అతను ప్రజలకు చేసిన వాగ్దానాలు నిలబెట్టుకున్నాడు. అతని పాలన గురించి ప్రజల నుంచి ఏ ఆక్షేపణారాలేదు.

ఏడాది పూర్తికాగానే తిరిగి, రాజు పదవికి ఎన్నికలు వచ్చాయి. ఈసారి సింహం చిహ్నం రెండవవాడి పెట్టెలకు అమర్చబడింది. తిరిగి రాజకుమారు లిద్దరూ రాజ్యంలోని మారుమూల పల్లెలకు కూడా పోయి ఎన్నికల ప్రచారం చేశారు.

ఎన్నికలు ముగిసినాక చూస్తే రెండవ వాణ్ణే ప్రజలు ఎన్నుకున్నట్టు స్పష్టమయింది. రెండవవాడు రాజై, సంవత్సరం లోపల దేశానికి ఎన్నడూ లేని చిక్కులన్నీ





తెచ్చి పెట్టాడు; ఇరుగు పొరుగు దేశాలతో తగాదాలు పెట్టుకున్నాడు; యుద్ధసన్నాహాలు చేసి, అందుకుగాను ప్రజల మీద ఎన్నడూ ఎరగని పన్నులు ఎన్నో వేశాడు. వివిధ వృత్తులు చేసే వారిని సైనికావసరాలకు నియోగించి, అన్ని వాడుకవస్తువులకూ కొరత తెప్పించాడు. పంటపొలాలకు నీటి సౌకర్యాలు చూసే నాధుడు లేక చివరకు పంటలు కూడా దెబ్బతిని, కరువుపరిస్థితి ఏర్పడింది. అయితే దేశానికి ఇంకా తీవ్రమైన నష్టాలు కలగక ముందే మళ్ళీ ఎన్నికలు వచ్చాయి.

ఈసారి సింహం చిహ్నన్ని పెద్దవాడికి ఇయ్యా పంకల్పించాడు రాజు. కాని చిన్నవాడు అందుకు అభ్యంతరం చెప్పాడు. పెద్దవాడు తనకు ఈసారి సింహం చిహ్నం రావటం న్యాయంగా వుంటుందని తండ్రితో అన్నాడు.

రాజు తన పెద్ద కొడుకుతో, "పిచ్చివాడా, చిహ్నంలో ఏమున్నది? మొదటిసారి ప్రజలు నిన్ను ఎన్నుకున్నారంటే, నువు సింహాసనానికి వారసుడవని ఎన్నుకున్నారు. రెండోసారి నీ తమ్ముడి పరిపాలన ఎలా ఉంటుందో చూడాలని అతన్ని ఎన్నుకున్నారు. కాని ఇప్పుడు ప్రజలు మీ ఇద్దరి పరిపాలనా చూశారు గనక చిహ్నంతో ప్రమేయం లేకుండా ప్రజలు నిన్నే ఎన్నుకుంటారు. ప్రజలు మూర్ఖులు కారు," అన్నాడు.

తండ్రి మాటలలో విశ్వాసం ఉంచి, రాజుగారి పెద్ద కొడుకు సింహం చిహ్నం కోసం పట్టుబట్టక, ఆ చిహ్నన్ని తన తమ్ముడికే ఉండనిచ్చాడు.

మూడోసారి ఎన్నికలో కూడా చిన్నవాడే ప్రజలచేత ఎన్నుకోబడ్డాడు. రాజు వెంటనే రాజ్యాన్ని రెండుగా విభజించి తన ఇద్దరు కొడుకులకూ ఇచ్చి, తాను బైరాగిదుస్తులు ధరించి మఠంలో ప్రవేశించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, నాకు కొన్ని సందేహాలున్నాయి. ప్రజలు మూడో ఎన్నికలో కూడా అయోగ్యుడైన

చిన్న రాజకుమారుణ్ణే ఎందుకు ఎన్నుకున్నారు? యోగ్యుడైన పెద్దవాడికి తాను రాజ్యం ఇస్తే అడ్డే వారు లేరు గదా, రాజు రాజ్యాన్ని రెండుగా ఎందుకు విభజించాడు? పైపెచ్చు ఆయన బైరాగి దుస్తులు ధరించి మఠ ప్రవేశం చెయ్యటానికి కారణం ఏమిటి? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసికూడా చెప్పకపోతే నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ప్రజలు మంచి పరిపాలన అనుభవించారేగాని, దాని స్వభావాన్ని ఎరగరు. తమ మంచి చెడ్డలకూ, పరిపాలనకూ సంబంధం ఉంటుందని వారికి తెలియలేదు. వాళ్ళు సింహం గుర్తుమాత్రమే ఆదరించారు. చిన్నవాడు ఎంత చెడ్డగా పరిపాలించినా ఆ గుర్తు ఉన్నంత కాలమూ ప్రజలు వాణ్ణి ఎన్నుకుంటారని స్పష్టమయింది. ఈ ఎన్నికలు రాజుకు కనువిప్పు కలిగించాయి. ప్రజలు మూర్ఖులు కారని ఆయన అనుకున్నది అబదమయింది. అంతేగాక ప్రజలను గురించి తనకన్న చిన్నవాడికే బాగా తెలుసునని ఆయన గ్రహించాడు. ప్రజలు అజ్ఞానం చేతనే అయినా చిన్నవాణ్ణి ఎన్నుకుంటున్నప్పుడు వాడికి రాజ్యం లేకుండా చెయ్యటం ధర్మంకాదు. అలాగని తన అడుగు జాడలలో రాజ్యపాలన చేసే సమర్థత గల పెద్దవాడికి రాజ్యం లేకుండా చెయ్యటం కూడా అక్రమమే అవుతుంది. అందుచేత ఆయన రాజ్యాన్ని రెండుగా చీల్చాడు. ఇక ఆయన మఠానికి వెళ్ళిపోవటానికి కారణం విరక్తి. తన జీవితమంతా దేశాన్ని ఎంతో చక్కగా పాలించి, ఆదర్శ ప్రభువని ఖ్యాతి తెచ్చుకుని కూడా ఆయన తన ప్రజలకు రాజకీయ పరిజ్ఞానం ఏమాత్రమూ కలిగించలేక పోయాడు. వారికి దుష్పరిపాలనను నిరాకరించే జ్ఞానం కూడా లేదు. అందుచేతనే రాజుకు వైరాగ్యం పుట్టింది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# మంత్రి యుక్తి

పూర్వం ఒక రాజుగారు ఏటా పండిత సన్మానం చేసి, దాన ధర్మాలతో పండితులను సత్కరించేవాడు. కాని ఒక ఏడు ఏదో కారణాలవల్ల రాజుగారి ఖజానా ఖాళీ అయింది. పండితులకు వార్షికాలు ఇవ్వటం ఎలాగా అన్న సమస్య రాజును బాధించింది.

రాజుగారు తన బాధను మంత్రికి చెప్పుకున్నాడు. మంత్రి కొంచెం ఆలోచించి, ఈ సమస్యను తాను పరిష్కరిస్తానని మాట ఇచ్చాడు.

పండిత సన్మానం జరిగే రోజు వచ్చింది. సంభావనల కోసం పాతవారూ, కొత్తవారూ అధికంగా పండితులు వచ్చారు.

మంత్రి కొత్తగా వచ్చిన వారికి ఒక విడిదీ, ఆనవాయితీగా వస్తున్న పండితులకు మరొక విడిదీ ఏర్పాటు చేశాడు. ఆయన ముందుగా, కొత్తగా వచ్చిన పండితుల విడిదికి వెళ్ళి, "రాజుగారి ఆరోగ్యం బాగుండలేదు. అందుచేత ఈ ఏడు కొత్త పండితులకు సన్మానం లేదు. మీ రంతా వెళ్ళిపోవచ్చు," అని చెప్పాడు.

తరవాత ఆయన పాత పండితుల విడిదికి వెళ్ళి, "రాజుగారి ఆరోగ్యం బాగుండలేదు. అందుచేత ఈ ఏడు కొత్త పండితులకు మాత్రమే సన్మానం జరుపుతున్నారు." అని పాత పండితులను కూడా పంపేశాడు. —కె. మార్కండేయులు





# ధనానికి ధనసహాయం

ఒకానొక కాలంలో ఒక రాజు ఇంటి ముందుకు ఒక బైరాగి వచ్చి, "నాకు తెలివి అయితే ఉన్నది గాని దాన్ని ఉపయోగించుకునే వాళ్ళు ఎక్కడా కనిపించటం లేదు. దాన్ని నేనూ ఉపయోగించుకోలేను, ఏంచేస్తాం?" అని గట్టిగా అని వెళ్ళిపోతూ ఉండే వాడు.

రోజూ ఈ మాటలు వింటున్న రాజు ఒక నాడు బైరాగిని పిలిచి, "నువు రోజూ అనే ఈ మాటలకు అర్థమేమిటి?" అని అడిగాడు.

"రాజా, ఓపిక వహించి, నన్ను నమ్మి, నాకు కావలిసినంత డబ్బు ఇస్తే, నీ ఖజానా నింపుతాను. నేను నీ దగ్గిర పుచ్చుకున్న ధనానికి పదింతలు లాభం వస్తుంది. నేను అన్నీ వదులుకుని బైరాగిని అయిన తరవాతనే నాకు ఈ ఆలోచన వచ్చింది," అన్నాడు బైరాగి.

బైరాగి కోరినంత ధనం ఇయ్యటానికి రాజు ఒప్పుకున్నాడు. కాని మంత్రి రాజుతో రహస్యంగా, "ఇందులో ఏదైనా మోసం ఉండవచ్చు. బైరాగులను నమ్మరాదు," అన్నాడు. అయినా రాజు ఆ బైరాగికి అడిగినంత ధనం ఇచ్చి పంపేశాడు.

ఒక సంవత్సరం తరవాత ఆ బైరాగి తిరిగివచ్చి, "జ్ఞాపకం ఉన్నానా, మహారాజా? నా ఆలోచన అమలు చేస్తున్నాను, మరికొంత ధనం కావాలి," అన్నాడు.

"వీణ్ణి చెరసాలలో పెట్టటానికి అనుమతి ఇయ్యండి, మహారాజా," అన్నాడు మంత్రి రాజుతో రహస్యంగా.

"అందుకు ఇంకా సమయం రాలేదు. ఈ బైరాగి మనను ఓపిక పట్టమనీ, తనను నమ్మమనీ అడిగి ఉన్నాడు," అని మంత్రితో అని రాజు బైరాగికి రెండోసారి ధనం ఇచ్చి పంపేశాడు.

ఆర్. కేశవరావు



మరొక సంవత్సరం గడిచింది. ఆ బైరాగి మళ్ళీవచ్చి, "నేను చేస్తున్న పని చివరి ఘట్టంలో ఉన్నది. ధనం తక్కువయింది. అందుకే వచ్చాను, మహారాజా!" అన్నాడు రాజుతో.

మంత్రి తొందరపడుతూ, "దొంగ బైరాగీ! మాయ మాటలు చెప్పి ధనం తీసుకు పోతున్నావు. ఇందులో రహస్యం ఏమిటో చెప్పు. లేకపోతే నిన్ను చెరలో పెట్టిస్తాం," అన్నాడు.

రాజు మంత్రిని శాంతపరచి, బైరాగి కోరిన ధనం ఇచ్చి పంపేశాడు.

మరొక సంత్సరం గడిచింది. బైరాగి మళ్ళీ వచ్చాడు.

"ఇంకా ధనం కావాలా?" అని రాజు బైరాగిని అడిగాడు. మంత్రి బైరాగి మీద కత్తి దూయటానికి సిద్ధపడ్డాడు.

"మీ ఓపికకు ధన్యవాదాలు. పని పూర్తి అయింది. మీ రిద్దరూ నా వెంట రండి," అన్నాడు బైరాగి.

రాజు బైరాగి వెంట బయలుదేరటానికి సిద్ధపడుతూ ఉండటం చూసి మంత్రి, "మన ఇద్దరినే రమ్మంటున్నాడు బైరాగి. ఎక్కడికో, ఎందుకో తెలియకుండా, ఈ బైరాగిని గుడ్డిగా నమ్మి ఇతని వెంట వెళ్ళటం మంచిది కాదు," అన్నాడు.

"నమ్మటానికీ, ఓపిక పట్టటానికీ ముందే ఒప్పుకున్నాను కదా మంత్రీ? అవసరమైతే నన్ను నేను రక్షించుకోలేనను కుంటున్నావా?" అన్నాడు రాజు.

"మంత్రిగారు భయపడు తున్నట్టయితే ఇద్దరు అంగరక్షకులను వెంటతీసుకు రండి," అన్నాడు బైరాగి.

"ఏమీ వద్దు. పోదాం పద," అన్నాడు రాజు. మంత్రి మాత్రం అంగరక్షకులు రహస్యంగా తమను వెన్నాడి వచ్చేటట్టు ఏర్పాటు చేశాడు.

బైరాగి వాళ్ళను నగరం దాటించి, కొండ దాటించి, అరణ్యం దాటించి, సముద్ర తీరానికి తీసుకు పోయాడు. అక్కడ ఒక చిన్న పడవ ఉన్నది. బైరాగి,

రాజూ, మంత్రీ అందులో ఎక్కారు. వీరికీ, ఇద్దరు పడవ వాళ్ళకూ మటుకే ఆ పడవలో చోటున్నది. వెనకగా వచ్చిన అంగరక్షకులు తీరానే ఉండి పోవలసి వచ్చింది.

పడవ పోయి పోయి ఒక చిన్న దీవి చేరింది. ఆ ద్వీపం నిండా మడమల లోతు బూడిద ఉన్నది. బూడిదకు ఎగువగా కొంగలు మందలు మందలుగా ఎగురు తున్నాయి. బూడిద కుప్ప మధ్యగా ఒక కాలిబాట ఉన్నది. ఆ బాట వెంబడి ముందు బైరాగీ, అతని వెనకగా కత్తి పిడి మీద చెయ్యివేసి మంత్రీ, మంత్రి వెనకగా రాజూ నడుచుకుంటూ వెళ్ళారు.

"ఇదేం దీవి? ఏదో మంత్రాల దీవి లాగున్నదే? మమ్మల్ని ఎక్కడికి తీసుకు పోతున్నావు?" అంటూ మంత్రి కత్తి దూసి, బైరాగిని అడిగాడు.

"తొందరపడకండి. ఇది చిన్న దీవి. ఎక్కువమంది వస్తే బూడిద చెదిరిపోతుంది, కొంగలు బెదిరిపోతాయి. అందుకే రక్షక భటులను రావద్దన్నాను," అన్నాడు బైరాగి.

బైరాగి ఒక చోట ఆగి, అక్కడ ఉన్న ఇనుప తలుపును ఎత్తాడు. దిగువకు మెట్లు ఉన్నాయి. ఆ మెట్లు దిగి వెళ్ళి అడుగున ఏమున్నదో చూసి రమ్మని బైరాగి రాజుతో అన్నాడు. రాజు తిరిగి వచ్చేదాకా మంత్రి బైరాగిని పట్టుకుని ఉన్నాడు.

రాజు భూగృహంలోకి దిగి ముత్యాల రాసులు చూశాడు. ఆయన పైకి వచ్చి, మంత్రిని కూడా వెళ్ళి చూసి రమ్మన్నాడు.



మంత్రి వెళ్ళి చూసి వచ్చి, బైరాగికి క్షమాపణ చెప్పుకున్నాడు.

రాజు బైరాగిని, "ఏమిటి ఇదంతా?" అని అడిగాడు.

దానికి బైరాగి ఇలా చెప్పాడు:

"నేను సదానందు అనే వర్తకుణ్ణి. నేను వర్తకం చేస్తూ ఈ దీవి రహస్యం ఒకటి తెలుసుకున్నాను. ఈ దీవి చుట్టూ బండలున్నాయి. సముద్రానికి పోటు వచ్చినప్పుడు అవి నీటిలో మునిగి ఉంటాయి. అటు వచ్చినప్పుడు ఆ బండలు బయట పడతాయి. ఆ బండల మీద అంతులేని ముత్యపు చిప్పలు ఉన్నాయి. కొంగలు ముత్యపు చిప్పలలోని మాంసం కోసరం వాటిని ఎత్తుకు వచ్చి దీవి పైన వాలుతాయి. ఆ ముత్యపు చిప్పలలో అంతులేని ముత్యాలు ఉంటాయి. ఆ తరగని ధనాన్ని నేను సంగ్రహించే ప్రయత్నం చేసే లోపల నా భార్యా, బిడ్డలూ మరణించారు. నాకు జీవితం మీద విరక్తి కలిగి బైరాగిని అయిపోయాను. కాని ఈ దీవిలోని ముత్యాల ఆలోచన నన్ను వదలలేదు. ఆ ఆలోచన పోతేగాని నాకు వైరాగ్యం పూర్తిగా కుదిరే టట్టు కనిపించలేదు. అందుకే మీ సహాయం కోరాను. మీ రిచ్చిన డబ్బుతో ఒక భూగృహం తవ్వించాను; దీవి అంతటా దట్టంగా బూడిద చల్లించాను. ఆ బూడిదలో కూరుకు పోయిన ముత్యపు చిప్పలను కొంగలు చూడలేవు; మళ్ళీ వెళ్ళి ముత్యపు చిప్పలను తెస్తాయి. తరవాత పడవనూ, మనుషులనూ ఏర్పాటు చేసి, ముత్యపు చిప్పల నుంచి ముత్యాలు తీయించి, భూగృహంలో పోశాను. చేసి చూపితేగాని మీరు నమ్మరని ఈ విషయం మీ దగ్గర రహస్యంగా ఉంచాను. నేను తలపెట్టిన పని ముగిసింది. ఇకనుంచీ ముత్యాలను మీరే పోగు చేసుకో వచ్చు. ఇక నాకు జీవితం మీద ఏ మమకారమూ లేదు. నేను పోయి నిశ్చింతగా తపస్సు చేసుకుంటాను. మీరూ, మీ ప్రజలూ సుఖంగా ఉండండి!"

ఇలా చెప్పి బైరాగి తనదారిన తాను వెళ్ళిపోయాడు.



# తిండి దొంగ

ఒక గ్రామంలో ఒక ధనికుడు ఉండేవాడు. ఆయన గొప్ప దాతగా పేరు పడ్డాడు. ఆయన ఇంట ఒకసారి గొప్ప సంతర్పణ జరిగింది. చాలామంది బ్రాహ్మణులు వంట సహాయం చేశారు. ఊళ్ళో ఉన్న అన్ని కులాలవాళ్ళూ తృప్తిగా భోజనాలు చేశారు.

భోజనాలు ముగిశాక వంటబ్రాహ్మలలో ఒకడు ఒక పళ్ళెం నిండా బొబ్బట్లు పెట్టుకుని దొడ్డి తోవన వెళ్ళిపోతూ పహరావాడికి దొరికిపోయాడు. పహరావాడు ఆ బ్రాహ్మణ్ణి యజమాని ముందుపెట్టాడు.

ధనికుడు అతన్ని, "ఏమయ్యా, పంతులూ? ఇవెందుకు పట్టుకు పోతున్నావు?" అని అడిగాడు.

బ్రాహ్మడు భయంతోనూ, అవమానంతోనూ సతమతమవుతూ, "అయ్యా, క్షమించండి. నేను కడుపునిండా తిన్నాను గాని, ఇంటి వద్ద నాకు గంపెడు పిల్లలున్నారు. వాళ్ళు తినలేదనే బాధతో ఈ తప్పుడు పని చేశాను," అన్నాడు.

"తప్పు కాదామరి? ఈ బొబ్బట్లు తిని నీ పిల్లలు కడుపు నొప్పితో బాధపడరూ? లోపలికి వెళ్ళి జాడీచెంబు నిండా నెయ్యికూడా పట్టుకుపో!" అన్నాడు ధనికుడు.

బ్రాహ్మడు కృతజ్ఞతతో ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు.

—మల్లా మహేశ్వరరావు





# దెబ్బకు దెబ్బ

ఒక పల్లెటూరిలో వెంకన్న అనే కుర్రాడు ఉండే వాడు. వాడికి ఉర్లగడ్డ కూర అంటే చాలా ఇష్టం. కాని ఏ కారణం చేతనో కొన్ని రోజులుగా ఆ వూరికి ఉర్లగడ్డల రాక నిలిచిపోయింది.

వెంకన్న వాటి కోసం చాలా రోజులు చూసి, లాభం లేదనుకుని, బస్తీకి పోయి ఉర్లగడ్డల కూర తినివద్దా మనుకుని, ఒక నాటి ఉదయం ఇంట్లో ఎవరితోనూ చెప్ప కుండా బయలుదేరాడు.

వెంకన్న బస్తీ చేరే సమయానికి లారీ నుంచి ఉర్లగడ్డలు దించుతున్నారు. మిగిలిన కూలీలతో బాటు వెంకన్న కూడా బస్తాలు దించటానికి సహాయపడ్డాడు. వాడి శ్రమకు లారీవాళ్ళు డబ్బులివ్వబోతే, ఉర్లగడ్డలు అడిగితీసుకుని, వాటిని తన కండువాలో మూట గట్టుకుని, వీధిన పడి నడవసాగాడు.

ఒక ఇంటి ముందు ఒక ఇల్లాలు నిలుచుని ఉండి, "ఏమిటి, బాబూ, ఆ మూటలో ఏముందేం?" అని వెంకన్నను అడిగింది.

వెంటనే వెంకన్న ఆమెను సమీపించి, "అమ్మా, మాది పొరుగూరు. రెండురోజుల నుంచీ అన్నం లేదు. ఈ ఉర్లగడ్డలు కాస్త వండిపెట్టు, తల్లీ, నీకు పుణ్యం ఉంటుంది," అన్నాడు.

వెంకన్న లాగే ఆ ఇల్లాలికి కూడా ఉర్ల గడ్డలంటే మహా ఇష్టం. పైగా వాటి కోసం మొహం వాచి ఉన్నది. ఎందుచేతనంటే, ఆమె భర్తకు పెద్ద జబ్బుచేసి నయమయింది. ఆయనకు ఉర్లగడ్డల వాసన తగిలితే జబ్బు తిరగబెట్టు తుందని డాక్టరు చెప్పాడట. అందుచేత వారి ఇంట ఉర్లగడ్డ వండటానికి లేదు. వెంకన్న ఆమెకు మంచి అవకాశం కలిగించాడు. ఎందుకంటే,

వేమూరు వెంకయ్యానాయుడు

ఆమె భర్త పొరుగూరు వెళ్ళాడు; రాత్రికి గాని ఇంటికి తిరిగి రాడు. అందుచేత ఆమె వెంకన్నకు ఉర్లగడ్డలు వండి పెట్టటానికి ఒప్పుకున్నది.

వెంకన్న మూట విప్పి, ఉర్లగడ్డ లన్నీ ఆమె కిచ్చి, మధ్యాన్నానికి వస్తానని చెప్పి, బజారుకు వెళ్ళాడు. వాడు తిరిగి వచ్చే లోపుగా ఆ ఇల్లాలు ఉర్లగడ్డలు వండి, ఆత్రం కొద్దీ కూర అంతా తానే తినేసి కూర్చున్నది.

మధ్యాన్నానికి వెంకన్న తిరిగి వచ్చాడు. ఆ ఇల్లాలు ఉర్లగడ్డల కూరతోబాటు ఇంత కూడు కూడా పెట్టుతుందని వాడు ఆశ పడ్డాడు. వాడు ఆశపడ్డట్టే ఆ ఇల్లాలు ఆకు నిండా ఇంత అన్నమూ, గోంగూర పచ్చడీ వేసితెచ్చి వాడి ముందు పెట్టి లోపలికి వెళ్ళింది. ఉర్లగడ్డ కూర తరవాత వస్తుంది కాబోలు ననుకుని వెంకన్న గోంగూర పచ్చడితో అన్నం తినేశాడు.

ఆమె మళ్ళీ వచ్చి అన్నం వడ్డించి, మజ్జిగ పోస్తూ, "రెండు రోజులుగా తిండి తినలేదంటున్నావు. తొందరపడక కడుపు నిండా తిను, బాబూ," అన్నది.

వెంకన్న నిరాశ చెంది, "అమ్మా, నేను తెచ్చిన ఉర్లగడ్డలు ఏమయాయి?" అని అడిగాడు.

"అన్నట్టు చెప్పటం మరిచాను. నీ ఉర్లగడ్డలు పొయ్యిమీద పెట్టి, ఇతర పనులు చూసు కోవటంలో కాస్త ఆలస్య మయే సరికి, పొయిలో మంట ఎక్కువై



ఉర్లగడ్డలు మాడి గోంగూర అయింది, నాయనా! నేనేం జేసేది?" అన్నదామె.

"పోనీ లెండి, కడుపునిండా అన్నం పెట్టారు. అంతే చాలు. వెధవ కూర, ఈ రోజు కాకపోతే రేపు తింటాను. కాని— చూడండి, అమ్మగారూ! రెండు రోజుల నుంచీ స్నానం లేదు. చన్నీళ్ళు అలవాటు లేదు. కాస్త అండా ఇచ్చారంటే, మన ఇంటిముందే నీళ్ళు కాచి పోసుకుంటాను," అన్నాడు వెంకన్న.

ఉర్లగడ్డలు కాజేసినందుకు ఆ మాత్రం సహాయం చెయ్యవచ్చు ననుకుని ఆమె లోపలి నుంచి అండా తెచ్చి వెంకన్న కిచ్చి, లోపలికి వెళ్ళిపోయింది.

ఆమె లోపలికి పోగానే వెంకన్న నీటి కొళాయి వద్దకు వెళ్ళి, అక్కడ నీటి కోసం వరసలో పెట్టి ఉన్న కుండ ఒకటి తీసి, దాని స్థానంలో అండా ఉంచి, కుండలో కొంచెం నీళ్ళుపోసి, వాటిని కాచసాగాడు.

కొంచెంసేపు అయాక ఆ ఇల్లాలు బయటికి వచ్చి, పొయ్యిమీద ఉన్న కుండను చూసి ఆశ్చర్యపోతూ, "పొయ్యిమీద కుండ పెట్టావు. అండా ఏమయింది?" అని వెంకన్నను అడిగింది.

"అరెరే! మంట ఎక్కువయింది కాబోలు నండీ! అండా కుండగా మారింది!" అన్నాడు వెంకన్న.

"నన్ను మోసం చెయ్యాలని చూస్తున్నావా? నా అండా ఎక్కడ దాచావు?" అని ఆ ఇల్లాలు కోపంగా అడిగింది.

వెంకన్న గొంతు పెద్దదిచేసి, "ఎవరిదమ్మా, మోసం? ఉర్లగడ్డలు గోంగూరగా మారినప్పుడు అండా కుండగా మారడం విడ్డూరమా?" అన్నాడు.

రచ్చ అవుతుందని భయపడి ఆ ఇల్లాలు లోపలికిపోయి తలుపు వేసుకున్నది.

వెంకన్న కుండ తీసుకుపోయి యథాస్థానంలో పెట్టి, అండా తీసుకుని పోయి బజారులో అమ్మి, పది వీశల ఉర్లగడ్డలు కొనుక్కొని తన ఊరుకు వెళ్ళి, అవి అయిపోయిన దాకా తల్లి చేత వండించుకుని, తృప్తిగా తిన్నాడు.





ఒక నగరంలో బాపాయమ్మ అనే పూట కూళ్ళ మనిషి ఉండేది. ఆమెకు భర్త పోయాడు, సవతి కూతురు విమల ఉన్నది. భర్త పోయాక బాపాయమ్మ బతుకుతెరువు కోసం పూటకూళ్ళు పెట్టసాగింది. వర్తక వ్యాపారాలకు ప్రసిద్ధి చెందిన ఆ నగరానికి జనం తాకిడి బాగా ఉండేది. పూటకూళ్ళ వ్యాపారం జోరుగా సాగింది. అయితే, వచ్చే పోయే వాళ్ళకు వండడమూ, వార్చడమూ, వడ్డించడమూ మొదలైన చాకిరీ అంతా విమల చేత చేయించేది బాపాయమ్మ. అన్ని విధాలా ఆమెను బాపాయమ్మ రాచి రంపాన పెట్టేది.

విమల అందమైన పిల్ల. ఆమెకు పెళ్ళి యీడు వచ్చింది, కాని బాపాయమ్మ ఆ పిల్ల పెళ్ళి మాట తలపెట్టలేదు. విమల పెళ్ళి చేసుకుని అత్తవారింటికి వెళ్ళిపోతే బాపాయమ్మకు అడ్డమైన చాకిరీ ఎవరు చేస్తారు?

ఇరుగు పొరుగు వాళ్ళు విమల పెళ్ళి మాట ఎత్తితే బాపాయమ్మ, "పిల్ల తప్పితే నా కెవరున్నారు? దాన్ని విడిచి క్షణం ఉండ లేను. నేను కట్నాలు ఇచ్చుకోలేను గదా! దాన్ని పెళ్ళాడే వాడు నన్నే కట్నంగా భావించి వెంట తీసుకు పోవాలి," అనేది.

బాపాయమ్మ ఈ ధోరణి అవలం బించటం చేత విమలను చేసుకుంటామని ఎవరూ ముందుకు రాలేదు. కట్నం లేకుండా విమలను చేసుకునే వాళ్ళున్నారు గాని, బాపాయమ్మను భరించటానికి సిద్ధ పడిన వాళ్ళు లేరు. విమల పరిస్థితి గ్రహించి, తనకిక ఈ జన్మలో పెళ్ళికాదని నిరాశ చేసుకున్నది.

ఇలా ఉండగా ఒక నాటి మధ్యాహ్నం ఒక యువకుడు బాపాయమ్మ ఇంటికి వచ్చి, తన పేరు రామదాసు అని చెప్పు కున్నాడు. అతను భోజనం చేసి, బాపా

ఎం. కామేశ్వరరావు



యమ్మకు డబ్బులు ఇస్తూ, "నేను తగిన కన్యను చూసి పెళ్ళాడాలను కుంటున్నాను. ఈ చుట్టు పక్కల మంచి సంబంధాలేవైనా ఉన్నాయా?" అని అడిగాడు.

"ఇల్లు కదలని దాన్ని, నాకేం తెలుస్తుంది?" అన్నది బాపాయమ్మ.

ఆవిడతో కబుర్లాడుతున్న ఇరుగు పొరుగు స్త్రీలు, "మాణిక్యం లాటి పిల్ల ఇంటో ఉండగా తెలియదంటావేం, బాపాయమ్మా?" అన్నారు.

"దాన్ని చేసుకోవటం అంత తేలికా?" అన్నది బాపాయమ్మ.

"అంత కష్టమా? అసలు సంగతేమిటి?" అన్నాడు రామదాసు.

బాపాయమ్మ రామదాసును ఉరిమి చూస్తూ, "దాన్ని పెళ్ళాడే వాడు కట్నం కింద నన్ను తీసుకోవాలి," అన్నది బెట్టుగా.

"అదొక కష్టమా? నీ వంటిది పెద్ద దిక్కుగా ఉంటే మేలేగద! ఇంకెందుకూ? పెళ్ళి చేసెయ్యి!" అన్నాడు రామదాసు.

ఆ కుర్రవాడు తన నియమం చూసి వెనక్కు తగ్గుతాడని బాపాయమ్మ అనుకున్నది గాని, అంత త్వరగా ఒప్పుకుంటాడనుకోలేదు. ఆమె అడ్డుపుల్ల ఒకటి వెయ్యాలనే ఉద్దేశంతో, "మరి మీ వంశ వృక్షం మాట కాస్త చెప్పు," అన్నది.

"అబ్బో. అది చాలా పెద్దది. చెప్పటం దేనికి? రేపు కళ్ళారా చూడవచ్చు," అన్నాడు రామదాసు.

బాపాయమ్మకు ఇంకేమి అభ్యంతరాలు సృష్టించాలో తోచలేదు. ఇరుగు పొరుగు అమ్మలక్కలు ఈ సంబంధానికి ఒప్పుకోమని ఒత్తిడి చేశారు. ఆవిడ విధిలేక పెళ్ళికి ఒప్పుకుని, విమలను రామదాసుకిచ్చి, నిరాడంబరంగా పెళ్ళిచేసేసింది.

పెళ్ళయిన మర్నాడే రామదాసు తన భార్యను తీసుకు పోతానన్నాడు. బాపాయమ్మ తన కున్న నగలన్నీ దిగవేసుకుని, డబ్బంతా మూటగట్టి రొండిన దోపుకుని, పూటకూళ్ళ ఇంటికి తాళం పెట్టి, నూతన దంపతుల వెంట బయలుదేరింది.

రామదాసు తన ఊరు ఎంతో దూరం లేదంటూ బాపాయమ్మను సాయంకాలం దాకా నడిపించాడు.

శోష వచ్చేలా ఉన్న బాపాయమ్మ, "ఎంత నడిచినా రాదేం మీ దిక్కుమాలిన ఊరు?" అన్నది రామదాసుతో.

"ఇంకెంత? వచ్చేశాం!" అన్నాడు రామదాసు. అస్తమయం వేళకు వాళ్ళు ఒక అడవి మధ్యకు చేరుకున్నారు.

"ఇక్కడే మన నివాసం!" అన్నాడు రామదాసు, దట్టమైన పొదల మధ్య ఒక పెద్ద మర్రిచెట్టును చూపిస్తూ. ఆ మర్రిచెట్టు మీద మంచె ఉన్నది. దాని మానులో దిగువన ఒక పెద్ద తొర్ర ఉన్నది.

"ఇదే మా వంశ వృక్షం. ఎంత పెద్దదో చూడు. మా తాత ముత్తాతలంతా ఇక్కడే పుట్టి పెరిగారు," అన్నాడు రామదాసు చెట్టుతొర్ర చూపిస్తూ.

"ఎంత దగా! వంశవృక్షం పెద్దదంటే ఏమో ననుకున్నాను. నా కొంప ముంచావు గదరా!" అన్నది బాపాయమ్మ కళ్ళు తేల వేసి. ఆవిడ శోకాలు ఆరంభించింది.

చీకటి ముంచుకొస్తున్నది. అడవిజంతువుల అరుపులు ఆరంభమయాయి. బాపాయమ్మ ఆ రాత్రి గడిస్తే మర్నాటి సంగతి మర్నాడు చూడవచ్చు ననుకుని, "ఈ రాత్రి నేను ఏ క్రూరమృగం వాతనో పడకుండా



చూడు. ఎలాగైనా ఆ మంచె మీదికి నన్ను చేర్చు." అన్నది రామదాసుతో.

"నీ స్థూల శరీరాన్ని మంచె మీదికి ఎక్కించటం నా తరమా? ఒక వేళ ఎక్కించినా, మంచెతో బాటు మా వంశ వృక్షం కాస్తా కూలి చక్కాపోతుంది. ఈ రాత్రికి ఏ ఎలుగుబంటో రాకముందే ఆ తొర్రలో దూరి పడుకో." అన్నాడు రామదాసు బాపాయమ్మతో.

బాపాయమ్మ ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని, బితుకు బితుకు మంటూ ఆ తొర్రలో దూరి కూర్చున్నది. విమల ఎలా చచ్చినా, ఈ రాత్రి గడిచి తాను తన ప్రాణాలతో బయటపడితే, తెల్లవారగానే తన

ఇంటికి తిరిగి పోవటానికి ఆమె నిశ్చయించుకున్నది.

తెల్లవార్లూ జాగారం చేసిన బాపాయమ్మకు తెల్లవార బోతూండగా కాస్త కునుకు పట్టింది. ఇంతలో ఎవరో తనను లాగుతున్నట్టయి బాపాయమ్మ మేలుకున్నది. నిలువెత్తు ఎలుగుగొడ్డు బాపాయమ్మను తొర్రలో నుంచి బయటికి లాగుతున్నది. బాపాయమ్మ కెవ్వుమని కేకలు పెట్ట సాగింది. ఆ కేకలకు ఎలుగ్గొడ్డు ఆమెను వదిలి పారిపోయింది. ఆ తరవాత కొంత సేపు బాపాయమ్మ కొయ్యబారిపోయి అచేతనంగా ఉండిపోయింది.

రామదాసు వచ్చి, "తెల్లవారకుండానే ఏం కొంప మునిగిందని కేకలు పెడుతున్నావు?" అని బాపాయమ్మ మీద విసుక్కున్నాడు.

బాపాయమ్మ కాస్త ధైర్యం తెచ్చుకుని, "మునగటానికి నీ కొక కొంపకూడా ఏడిచిందా ఏం? నన్ను ఎలుగుగొడ్డు పట్టుకున్నది! నేనిక ఇక్కడ ఒక్క క్షణంకూడా ఉండను. ప్రాణాలు దక్కితే చాలు. విమల ఏమైనా కానీ!" అంటూ చెట్టు తొర్రలో నుంచి బయటికి వచ్చింది.

బయటనే నిలబడి ఉన్న విమల మాట్లాడలేదు.

రామదాసు నవ్వి, "నా కట్నం కింద వచ్చిన దానివి, నిన్ను ఎలా పోనిస్తాను?" అన్నాడు.

ఈ మాటవిని బాపాయమ్మ తెల్లబోయింది. తన ఒంటి మీద నగలన్నీ తీసి విమలకు పెట్టి, తన రొండిన ఉన్న డబ్బు సంచీ రామదాసు మొహాన కొట్టి, ఆమె తిరుగుదారి పట్టింది.

తరవాత రామదాసు విమలను తీసుకుని కొండమీద ఉన్న తన ఇంటికి తీసుకుపోయాడు. ఆ ఇంటి గోడలకు వేళ్ళాడే జంతువుల చర్మాలు చూశాక, విమలకు తన భర్త వేటగాడని తెలిసింది. వాటిలో ఉన్న ఎలుగుగొడ్డు చర్మం చూడగానే, బాపాయమ్మను బెదరగొట్టిన ఎలుగుగొడ్డు రహస్యం విమలకు తెలిసిపోయింది.





# రూపమతి వివాహం

సాత్‌గర్ రాజ్యానికి వారసురాలైన రూపమతికి పద్దెనిమిది ఏళ్ళు నిండాయి. ఆమెకు తగిన వరుణ్ణి చూసి పెళ్ళి చేసే సమస్య శుభదేవ మహారాజుకు పట్టుకున్నది. రూపమతికి అనేక కళలలో ప్రావీణ్యం ఉన్నది; విద్వాంసురాలు కూడానూ. అందుచేత ఆమెకు తగిన వరుణ్ణి నిర్ణయించటానికి గాను స్వయంవరం ప్రకటించి, చారుల ద్వారా అనేక రాజ్యాలకు వర్తమానం పంపారు. స్వయంవరంలో జరిగే పరీక్షలలో నెగ్గి, రూపమతిని వివాహం ఆడాలన్న కోరికతో అనేక మంది రాజకుమారులు స్వయంవరం నాటికి సాత్‌గర్ రాజధానికి వచ్చారు.

విలువిద్యా, గుర్రపు స్వారీ, కత్తి యుద్ధమూ, మల్లయుద్ధమూ మొదలైన విద్యలలో పోటీలు జరిగాయి. ఈ పోటీలలో పాల్గొన్న రాజకుమారులు రెండు వందల మందిలో ముగ్గురు మాత్రమే అన్నిటా నెగ్గారు. రాజుగారు చిక్కులో పడ్డాడు. ఆయనకు ఉన్నది ఒక్క కుమార్తె. పరీక్షలలో నెగ్గిన వారు ముగ్గురున్నారు. ఏం చెయ్యటం?

"వీరు ముగ్గురిలో ఒకరిని ఎన్నుకోవటానికి మరొక పరీక్ష పెట్టుదాం," అన్నాడు ప్రధానమంత్రి.

అందుకు ముగ్గురు రాజకుమారులూ సమ్మతించారు.

"మీరు మీ మీ సహనశక్తులను విడివిడిగా ప్రదర్శించండి," అన్నాడు ప్రధానమంత్రి వారితో.

అన్ని పోటీలలోనూ నెగ్గిన అసీతాభుడూ, రుద్రరాజూ, బేనుదేవుడూ తమ తమ సహనశక్తులను, ఒకరికి తెలియకుండా ఒకరు, ప్రదర్శించటానికి తమ అంగీకారం తెలిపారు.

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

రుద్రరాజూ, బేనుదేవుడూ చూడకుండా అసీతాభుడు ఆహారపానీయాలు లేకుండా సూర్యోదయం లగాయతు సూర్యాస్తమయం వరకూ వేసవి ఎండలో నిలబడి తన సహన శక్తి ప్రదర్శించాడు.

రుద్రరాజు కూడా మిగతా ఇద్దరికీ తెలియకుండా, ఇసుక ప్రాంతంలో నడి ఎండలో ఇరవైమైళ్ళు కాళ్ళకు చెప్పులు లేకుండా పరిగెత్తాడు.

బేనుదేవుడు తన సహనశక్తి ప్రదర్శించవలసి వచ్చింది. అతను ఇంద్రజాల విద్యలు తెలిసినవాడు. అతని సేవకుడు కూడా ఆ విద్యలలో ప్రవేశంగలవాడే. బేనుదేవుడు తన సేవకుడి సహాయంతో తన సహన శక్తిని నిరూపించటానికి సిద్ధపడ్డాడు.

బేనుదేవుడు ఇరవై వాడి అయిన సూదులు తెమ్మన్నాడు. తరవాత అతను తన ఎడమ చేతి పిడికిలి ప్రదర్శించి, తన బొటన వేలిని పైకెత్తి పట్టుకుని, దాని మీద సిల్కు రుమాలు కప్పి, దాని కింద ఉన్న తన బొటన వేలిలోకి సూదులను గుచ్చమని రాజుగారితో అన్నాడు. ఇరవై సూదులనూ బొటన వేలిలోకి గుచ్చారు. బేనుదేవుడి ముఖాన బాధగాని, ఆరాటం గాని లేదు. పైపెచ్చు అతను నవ్వుతూ ఉండిపోయాడు.

ఇది చూసిన వారు హర్షధ్వానాలు చేసి, ఇంతకు మించిన సహనశక్తి ఎవరూ ప్రదర్శించలేరన్నారు. సూదులన్నిటినీ లాగేసినాక బేనుదేవుడు నవ్వుతూ తన



సిల్కు రుమాలును తిరిగి జేబులో పెట్టేసు కున్నాడు.

రూపమతికి బేనుదేవుడే తగిన భర్త అని నిర్ణయించి, వారిద్దరికీ వైభవనంగా పెళ్ళి చేసేశారు.

రోజులూ, నెలలూ, సంవత్సరాలూ గడిచాయి. శుభదేవ మహారాజు చనిపోయినాక, తన మామగారి సింహాసనం బేనుదేవుడిది అయింది. తన అనంతరం తన అల్లుడు రాజు కావాలని శుభదేవుడే నిర్ణయించాడు.

ఒక రోజు బేనుదేవుడు రూపమతినీ, ఇద్దరు పిల్లలనూ వెంటబెట్టుకుని అరణ్యంలో వేటకు వెళ్ళాడు. అరణ్యంలో ఒక చోట అడవి గులాబీల పొదలున్నాయి. వాటిలో రంగు రంగుల గులాబీలు పూశాయి. బేనుదేవుడి కుమార్తె లాజ్‌మతి ఒక గులాబీ పువ్వును చూపి, అది తనకు కావాలన్నది.

ఆ పువ్వును కోసుకు రమ్మని బేనుదేవుడు నౌకరును ఒకణ్ణి ఆజ్ఞాపించాడు. కాని లాజ్‌మతి దాన్ని బేనుదేవుడే కోసి తన కివ్వాలని మంకుతనం చేసింది.

"పిల్ల అంతగా అడుగుతూంటే పువ్వు కోసి ఇయ్యరాదా?" అన్నది రూపమతి బేనుదేవుడితో.

బేనుదేవుడు స్వయంగా వెళ్ళి, తన కుమార్తె కోసం పొదలో ఉన్న గులాబీలు కోస్తూ, "అమ్మో, చచ్చాను! ముల్లు గుచ్చు కున్నది!" అన్నాడు బాధతో.

"గులాబీముల్లు గుచ్చుకుంటే అంత బాధపడట మేమిటి? పసిపిల్లలు కూడా



నవ్వుతూ సహిస్తారే. ఇంత రాద్ధాంత మేమిటి? ఎదీ? నెత్తురొస్తున్నదేమో చూడనియ్యండి," అన్నది రూపమతి.

బేనుదేవుడు తన ఎడమ చేతి బొటన వేలు చూపించాడు.

" అరె! మీ సహనశక్తి నిరూపించటానికి ఈ వేలులోనే కాదూ ఇరవై సూదులు గుచ్చింది? అప్పుడు మీరేమీ చలించలేదే? ఈ చిన్న ముల్లు గుచ్చుకున్నందుకు ఇంత ఆర్భాటం చెయ్యటం ఆశ్చర్యం కాదూ?" అన్నది రూపమతి.

"మరోలా అనుకోకు. నాకు అంతటి సహన శక్తి లేదు. అప్పుడొక చిన్న ఇంద్ర జాలం చేశాను. నీ అందచందాలు చూసి మోహించాను గనక నిన్ను భార్యగా చేసు కోవటానికి అపాటి మోసం చెయ్యవచ్చు ననిపించింది," అన్నాడు బేనుదేవుడు.

రూపమతి కుతూహలంతో, "ఎలా చేశారు?" అని అడిగింది.

"చాలా తేలిక. నా ఎడమచేతి గుప్పిట్లో బొటనవేలు ఆకారంలో తయారు చేసిన కారట్ దుంప ఉన్నది. నా ఎడమచేతి మీద రుమాలు కప్పినాక నేను దాన్ని జాగ్రత్తగా పైకి ఎత్తి నా బొటనవేలు స్థానంలో ఉంచాను. సూదులన్నీ ఆ దుంపలోనే దిగ బడ్డాయి. నాకు బాధ ఏమీ కలగలేదు. తర వాత నేను రుమాలుతోపాటు ఆ దుంపను కూడా జేబులో పెట్టేసుకున్నాను. నిజం ఎవరూ కనిపెట్టలేదు," అన్నాడు బేను దేవుడు.

"ఎంత అన్యాయం! మా తండ్రినీ, ఆయన పరివారాన్నీ ఇలా మోసం చెయ్య టమా? నేనిది సహించను. ఇందుకు శిక్ష విధించవలిసిందే!" అన్నది రూపమతి కోపం నటిస్తూ.

"చేతులు జోడించి నిలబడి ఉన్నాను. మహారాణిగారు ఏ శిక్ష విధించినా సరే!" అన్నాడు బేనుదేవుడు.

"అంతఃపురంలో యావజ్జీవ శిక్ష," అన్నది రూపమతి.

"చిత్తం, మహారాణీ!" అన్నాడు బేనుదేవుడు.





# "కాళిదాసు గురువు"

భోజరాజు ఆస్థానంలో విష్ణుశర్మ అనే పండితుడు ఉండేవాడు. ఆయనకు కాళిదాసు మీద గుర్రుగా ఉండేది; కాళిదాసుకు అవమానం చేసే మార్గం దొరుకుతుందా అని ఎప్పుడూ చూసేవాడు.

ఇలా ఉండగా ఒక మూఢుడైన బ్రాహ్మడు ఒకడు విష్ణుశర్మ వద్దకు వచ్చి, "అయ్యా, నేనొక పేద బ్రాహ్మణ్ణి. నాకు చదువు సంధ్యలు లేవు. తమరు ఎలాగైనా నాకు రాజదర్శనం కలిగించి, నా దారిద్ర్యాన్ని తొలగించినట్టయితే, కలకాలం మిమ్మల్ని తలుచుకుంటాను," అని బతిమాలాడు.

ఈ బ్రాహ్మడి ద్వారా కాళిదాసుకు అవమానం చెయ్యవచ్చునని విష్ణుశర్మకు తోచింది. ఆయన ఆ బ్రాహ్మడితో, "అయ్యా, నువ్వు చదువుకున్నవాడివి కావు గనక రాజసభలో జరిగే పండితగోష్ఠిలో నువ్వు పాల్గొనటం సాధ్యం కాదు. అందుచేత నువ్వు సన్యాసి వేషం వేసుకుని, నలుగురైదుగురు శిష్యులను వెంట బెట్టుకుని, నేను రమ్మన్నప్పుడు రాజసభకు రా. నీకు శిష్యులను నేనే ఏర్పాటు చేస్తాను. ఊళ్ళో ఎవరైనా, 'మీ రెవరు?' అని అడిగితే, 'కాళిదాసు గురువును', అని చెప్పు. భోజరాజు నిన్ను పరీక్షించకుండానే బహుమానం ఇచ్చి పంపేస్తాడు," అన్నాడు.

ఇది విని ఆ అమాయకుడు తల గొరిగించుకుని, సన్యాసి వేషం వేసుకుని, నలుగురు శిష్యులను వెంట బెట్టుకుని రాజవీధిలో నాలుగు వీధుల కూడలిలో కూర్చున్నాడు. వీధి వెంట పోయేవాళ్ళు, "వీరు ఎవరు?" అని అడిగితే, "కాళిదాసు గురువు" అని శిష్యులు చెప్పారు.

ఈ సంగతి క్షణంలో నగరమంతా తెలిసింది. కాళిదాసుకు కూడా తెలిసింది. ఇదంతా విష్ణుశర్మ చేసిన కుట్ర అయిఉంటుందని

ఎస్. గోపాలకృష్ణ



గ్రహించి, ఆయన అవసరానికి తగిన పని చేద్దామనుకున్నాడు.

సన్యాసిని గురించి భోజరాజు కూడా విని, కాళిదాసుతో, "కవీశ్వరా, మీ గురువు గారు నగరానికి వచ్చినట్టు అందరూ చెప్పు కుంటున్నారు. మీరు వెళ్ళి చూశారా?" అన్నాడు.

"వారి దర్శనం చేద్దామనుకుంటు న్నాను," అని రాజుకు బదులు చెప్పి, కాళిదాసు ఆ రాత్రి దొంగసన్యాసి వద్దకు వెళ్ళి, "బ్రాహ్మడా, నువు కాళిదాసు గురువునని చెప్పుకుంటూ, కపట సన్యాసి వేషంతో కూర్చుని ఉన్నావు గదా, ఇందు వల్ల నీకేం లాభం?" అని అడిగాడు.

తనను ఇలా అడిగినవాడు కాళిదాసేనని తెలియగానే ఆ బ్రాహ్మడు భయపడి, తత్తరపడుతూ లేచి చేతులు జోడించి, "స్వామీ, నన్ను క్షమించండి. నేను విష్ణు శర్మ వద్దకు పోయి కాస్త ధనప్రాప్తి కలి గించమని ప్రార్థిస్తే ఆయన నాకీ వేషం వేసి ఇక్కడ కూర్చోబెట్టాడు. నాకేమీ తెలీదు. ఇంతే జరిగింది," అన్నాడు.

ఆ బ్రాహ్మడి దీనస్థితి చూసి కాళిదాసు జాలిపడి, "బ్రాహ్మడా, డబ్బు సంపాదించ టానికి ఎన్ని మార్గాలైనా ఉన్నాయి. దానికి నేను ఆక్షేపించను. నీ వంటి బీదబ్రాహ్మడు కాస్త డబ్బు చేసుకుంటే నాకు సంతోషమే. కాని ఒకటి గుర్తుంచుకో. నువు కాళిదాసు గురువని రాజుగారికి తెలిసింది. ఆయన తప్పక నిన్ను సభకు పిలిపిస్తారు. ఆయన నిన్నేమీ అడగకుండా డబ్బిచ్చి పంపితే చిక్కేలేదు. అలా కాక ఆయన నిన్నేదన్నా అడిగితే, నన్ను చూపు. నేనేదో ఒకటి చెప్పి, రాజుగారు నిన్ను మెచ్చుకునేటట్టు చేస్తాను," అన్నాడు.

కాళిదాసు ఊహించినట్టే, మర్నాడు భోజరాజు పల్లకి పంపించి, కాళిదాసు గురువును సగౌరవంగా సభకు తెప్పించాడు. నలుగురు శిష్యులనూ వెంట బెట్టుకుని ఆ బ్రాహ్మడు వైభవంగా సభకు వచ్చాడు. భోజరాజు భక్తితో ఆ బ్రాహ్మడికి ఎదురు

వెళ్ళి, తీసుకు వచ్చి, ఉచితాసనం మీద కూర్చోబెట్టాడు.

తరవాత భోజరాజు కాళిదాసు కేసి తిరిగి, "మీ గురువుగారిని ఒక విషయం అడగాలని ఉన్నది," అన్నాడు.

"తప్పకుండా అడగండి. వారికి తెలియనిదిలేదు," అన్నాడు కాళిదాసు.

అప్పుడు భోజరాజు బ్రాహ్మడి కేసి తిరిగి, ఎంతో వినయంగా, "స్వామీ, నేను అడిగే సందేహం మీకు చాలా అల్పంగా తోచినట్టయితే క్షమించాలి. లంకాధిపతి అయిన దశకంఠుడికి రావణుడు అనే పేరు రావటానికి రకరకాలుగా కారణాలు చెబుతున్నారు. రావణ శబ్దానికి వ్యుత్పత్తి అసలు ఏదో తమరు సెలవియ్యాలి," అన్నాడు.

కాళిదాసు గురువు ఏం చెబుతాడోనని సభ అంతా నిశ్శబ్దంగా ఉన్నది.

బ్రాహ్మడికి ఏమనాలో తోచక కొంచెం సేపు మౌనంగా ఉండి, "అ రాభణుడా?" అన్నాడు. ఈ మాట వినగానే సభలో అందరూ నిర్ఘాంతపోయారు.

భోజరాజు అమితాశ్చర్యంతో, "స్వామీ, అందరూ రావణుడు అంటారు గదా, రాభణుడు ఎందుకవుతాడు?" అన్నాడు.

అప్పుడా బ్రాహ్మడు భయంలో ధైర్యం తెచ్చుకుని, "నా శిష్యుడు చెబుతాడు," అంటూ కాళిదాసును చూపించాడు.

భోజరాజు కాళిదాసును అడిగాడు. కాళిదాసు ఇలా చెప్పాడు:

"భకారః కుంభకర్ణే చ,
　　భకార శ్చ విభీషణే;
తయో ర్జ్యేష్ఠే, కులశ్రేష్ఠే
　　భకారః కిం న విద్యతే?"

[కుంభకర్ణుడి పేరులో భకారం ఉన్నది. విభీషణుడి పేరులో కూడా భకారం ఉన్నది. ఆ ఇద్దరికన్న పెద్దవాడూ, కులశ్రేష్ఠుడూ (అయిన రావణుడికి) భకారం ఎందుకుండదు?]

ఈ సమాధానం విని భోజరాజు సంతోషించి, ఆ మూఢ బ్రాహ్మణుడికి సగౌరవంగా ఒక లక్ష ఇచ్చి సాగనంపాడు. విష్ణుశర్మకు మాత్రం మంచి అవమానం అయింది.





# పగతీర్చిన పాగా

మహార్వాడు సంస్థానానికి మండూ రాజధానిగా ఉండేది. జయదేవుడు దానికి రాజు. జయదేవుడు ఒకనాడు కొలువు తీరి ఉండగా చారణుడు ఒకడు వచ్చి, రాజు మీద ఆశువుగా అనేక పద్యాలు చెప్పి, అనేక విధాల స్తోత్రం చేశాడు.

భట్రాజులు వచ్చి స్తోత్రం చేసినప్పుడు రాజులు సంతోషించి, ఆ భట్రాజులను సత్కరించటం రివాజు. కాని జయదేవుడికి కవులన్నా, భట్టులన్నా కిట్టదు. అందుచేత ఆయన ఆ చారణుడికి బహుమానం ఇవ్వక పోగా, తిట్టి అవమానించి పంపాడు.

ఆ చారణుడు రాజును తిట్టుకుంటూ, అక్కడి నుంచి తిన్నగా హరవంశస్థుల రాజధాని అయిన బుయోడా పట్టణానికి పోయి, ఆ పట్టణాన్ని ఏలే రాజు అలూహరుడు వేటకు వెళ్ళినట్టు తెలుసుకుని, కోట గుమ్మం వద్ద కాచుకుని కూర్చున్నాడు.

కొంతసేపటికి రాజు సపరివారంగా వేట నుంచి తిరిగివచ్చాడు. ఆయన కోట ప్రవేశిస్తూండగా చారణుడు ఆయనను సమీపించి, "రాజమార్తాండా! రాజాధి రాజా! జయీభవ! దిగ్విజయీ భవ!" అని ఆశీర్వదించాడు.

రాజు సంతోషించి చారణుణ్ణి ఏం కావాలో కోరుకోమన్నాడు. చారణుడు తనను ధనమో, బంగారమో, మడులో, మాన్యాలో అడుగుతాడను కున్నాడు రాజు. కాని చారణుడు మాత్రం, "ప్రభూ, నాకు తమ తలపాగా దయచేయించండి." అన్నాడు.

"అదేమిటీ? నా తలపాగా నీకు కూడు పెడుతుందా? గుడ్డ పెడుతుందా? మడులో, మాన్యాలో కోరక గుడ్డముక్క కోరుతావేమిటి, పిచ్చివాడా?" అన్నాడు రాజు ఎంతగానో ఆశ్చర్యపోయి.

యస్. వి. శేషారావు

"ప్రభూ, తమ తలపాగా పెట్టుకుని తిరగాలని కోరికగా ఉంది. దీనితో దేశ దేశాలా తమ కీర్తి వ్యాపింప జేస్తాను," అన్నాడు చారణుడు.

రాజు ఆడి తప్పనివాడు; వెంటనే తన తలపాగా తీసి చారణుడికి ఇచ్చేశాడు. తురాయీ, జరీబుటేదారు పనిగల ఆ తల పాగా ధరించి చారణుడు మహారాజుకు మల్లే ఠీవిగా వెళ్ళిపోయాడు. అతను పోతుంటే చూసిన వాళ్ళు, అతన్ని ఒక పిచ్చివాడి కింద జమకట్టి, పొట్టలు చెక్క లయ్యేలా నవ్వుకున్నారు.

కొంతకాలం గడిచింది. చారణుణ్ణీ, అతని తలపాగానూ అందరూ మరిచి పోయారు. అంతలో ఒక నాడు ఆ చారణుడు అలూహరుడి వద్దకు వచ్చి, నలిగి పోయి ఉన్న తలపాగాను రాజు ఎదుట పెట్టి, వెక్కి వెక్కి ఏడవసాగాడు.

"ఏమయ్యా, ఎందుకు అలా దుఃఖిస్తున్నావు?" అని రాజు చారణుణ్ణి ఆత్రంగా అడిగాడు.

"ఏమని విన్నవించను, ప్రభూ? నా మూలంగా దేవరవారికి తీరని అవమానం జరిగి పోయింది." అన్నాడు చారణుడు.

"ఏం జరిగిందేమిటి?" అని రాజు మరింత ఆత్రంగా అడిగాడు.

"నేను తమ పాగా ధరించి దేశదేశాలూ తిరిగి, రాజులను సందర్శించి, కవనం చెప్పాను. ఆ రాజులకు నమస్కరించే



ముందు, కుడిచేతితో తలపాగా తీసి, వంగి ఎడమ చేతితో సలాము చేసేవాణ్ణి. ఎందుకిలా చేస్తున్నావని వారు అడిగినప్పుడు, 'ఇది అలూహర సార్వభౌముల వారి తలపాగా! ఇతరులకు వంగి నమస్కరించదు, అని వాళ్ళకు చెప్పుతుండేవాణ్ణి," అన్నాడు చారణుడు.

ఈ మాట విని రాజూ, సభికులూ ఎంతో సంతోషించి, చారణుణ్ణి మెచ్చుకున్నారు.

చారణుడు మళ్ళీ ఇలా చెప్పుకుపోయాడు:

"అయితే, తమ గౌరవాన్ని చివరవరకూ కాపాడలేక పోయాను, ప్రభూ! మార్వాడు రాజైన జయదేవుని సంస్థానంలో ప్రభువుల పాగాకు ఘోరమైన అవమానం జరిగింది. యథాప్రకారం నేను నమస్కరించే సరికి ఆయన కూడా నా ప్రవర్తన గురించి ఇతర రాజులు అడిగినట్టే అడిగాడు, నేను ఇతర రాజులకు చెప్పినట్టే ఆయనకూ సమాధానం చెప్పాను. కాని, ఇతర రాజుల లాగా ఆయన తమ ఘనతను ఆమోదించక, గద్దెపై నుంచి లేచివచ్చి, నా చేతనున్న తలపాగాను తన కాలితో తన్ని, నన్ను కొట్టించి, పంపేశాడు."

ఈ మాటలు విని రాజూ, సభికులూ ఉగ్రులైపోయారు.

"ఆ పొగరుబోతైన జయదేవుడికి బుద్ధి వచ్చేటట్టు చెయ్యాలి," అని సభికులు కేకలు పెట్టారు.

ఒక వృద్ధ మంత్రి, "ఒక గుడ్డపేలిక గురించి పరరాజుతో కయ్యం ఎందుకు?" అన్నాడు గాని, ఆయన మాటలు ఎవరు వినిపించు కుంటారు?

అలూహరుడు స్వయంగా నాయకత్వం వహించి, తన సేనలను నడిపించి మండూను ముట్టడించాడు.

జయదేవుడికీ, అలూహరుడికీ మధ్య గొప్ప యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో జయదేవుడు మరణించగా మండూ కోట అలూహరుడి వశమయింది.

జయదేవుడి వల్ల అవమానం పొందిన చారణుడి పగ చల్లారింది.





# అంతరంగికుడు

మహేంద్రగిరిని పురందరుడనే రాజు పాలించేవాడు. ఆయన రాజ్యతంత్రం బాగా తెలిసిన వాడే గాక, గొప్ప కళాపోషకుడు కూడా. అందుచేత ఆయన వివిధ కళలలో ప్రతిభ గలవారిని అవకాశం దొరికినప్పుడల్లా సత్కరిస్తూ ఉండే వాడు.

ఒక నాడు పురందరుడి సభకు ఒక విదేశీయుడు వచ్చాడు. అతని పేరు శ్రీకంఠుడు. ఇతిహాసాలు రాయటం అతని వృత్తి. అతడు అనేక దేశాలు తిరిగి, ఒక్కొక్క దేశంలోనూ ఒక్కొక్క సంవత్సరం పాటు ఉండి, ఆ దేశ భాష నేర్చుకుని, సంవత్సరం పూర్తి అయ్యే లోపుగా ఆ దేశానికి సంబంధించిన చరిత్ర సమగ్రంగా రాశాడు. ఇలా అతను పధ్నాలుగు భాషలలో ప్రావీణ్యం సంపాదించి, పధ్నాలుగు దేశాల చరిత్రలు రచించి, ఇప్పుడు మహేంద్రగిరికి వచ్చాడు.

అలాంటి వాడు తన రాజ్యానికి వచ్చినందుకు పురందరుడు ఎంతో సంతోషించి, "మా నగరంలో కూడా ఒక సంవత్సరం ఉండి, మా దేశచరిత్ర కూడా రాయండి. మీకు కావలసిన ఏర్పాట్లన్నీ నేను చేస్తాను," అన్నాడు.

"అలాగే చేస్తాను. నన్ను ఏడాది పాటు మీ అంతరంగికుడుగా ఉంచుకుని, మీ వెంట ఉండనివ్వండి. అందువల్ల నా పని తేలిక అవుతుంది," అన్నాడు శ్రీకంఠుడు.

అందుకు పురందరుడు సమ్మతించాడు. శ్రీకంఠుడు అధికారరీత్యా రాజుగారి అంతరంగికుడి హోదా సంపాదించి, రాజు వెంట విహారాలకూ, వేటకూ, యుద్ధాలకు సైతం వెళుతూ, రాజుగారి పరిపాలనా విధానాలన్నీ నిశితంగా పరిశీలిస్తూ, అప్పుడప్పుడూ నగరంలో పర్యటనలు చేస్తూ,

బూర్లె నాగేశ్వరరావు

అన్నిరకాల వాళ్ళతోనూ అనేక విషయాలు మాట్లాడుతూ కాలం గడపసాగాడు. అతను రాజుగారి అంతరంగికుడని నగరంలో అందరికీ త్వరలోనే తెలిసిపోయింది. అందుచేత అందరూ అతనికి ఎంతో గౌరవం చూపేవారు. నగరంలోని ధనికులూ, వర్తకులూ అతన్ని పిలిచి, విందులు చేసేవారు. అతని ద్వారా లాభం పొందవచ్చునని వారి ఆశ.

శ్రీకంఠుడు మహేంద్రగిరికి వచ్చి సంవత్సరం కావచ్చింది. అతను రాయటం మొదలు పెట్టిన మహేంద్రగిరి చరిత్ర కూడా పూర్తి కావచ్చింది. ఒక రోజు రాజుగారు ఆ అసంపూర్ణ గ్రంథాన్ని తెప్పించుకుని చదివాడు. అందులో ఆ దేశపు ఆచార వ్యవహారాలూ, ప్రజాక్షేమం కోసం రాజుగారు తీసుకునే ప్రత్యేక చర్యలూ, రాజుగారికీ, సభాప్రముఖులకూ మధ్య ఉండే విశ్వాసమూ, సహకారమూ మొదలైన వన్నీ చక్కగా వర్ణించి ఉన్నాయి.

"ఈ నగర ప్రజలు అమాయకులు. రాజు ధర్మాత్ముడు. రాజోద్యోగులు అపారమైన రాజభక్తి గలవారు. అయితే ఈ నగరపు వర్తకులూ, ధనికులూ, అక్రమంగా ధనార్జన చేసి, మోసంతో జీవిస్తున్నారు," అని శ్రీకంఠుడు ఆ గ్రంథంలో రాశాడు.

ఈ చివరి మాట రాజుకు నచ్చలేదు. ఆయన శ్రీకంఠుణ్ణి పిలిపించి, "నీ గ్రంథం అంతా బాగానే ఉన్నది. అందులో వంక పెట్టటానికి ఏమీలేదు. కాని నా నగరంలోని



వర్తకులూ, ధనికులూ స్వార్థపరులనీ, మోసగాళ్ళనీ రాశావు. ఇది ఎంత మాత్రమూ నిజంకాదు. వాళ్ళను గురించి నాకు బాగా తెలుసు," అన్నాడు.

"నేను రాసిన దానిలో ఏ మన్నా తప్పు లుంటే క్షమించాలి. ఈ గ్రంథాన్ని పూర్తి చేసే లోపల తప్పులన్నీ సవరణ చేసి మరీ వెళ్ళిపోతాను," అన్నాడు శ్రీకంఠుడు.

ఈ మాటతో రాజు తృప్తిపడ్డాడు.

మర్నాడు శ్రీకంఠుడు నగరంలో గల గొప్ప ధనికులనూ, వర్తకులనూ చూడబోయి, "రాజుగారు చక్రవర్తిగారికి కానుక పంపాలట. మీ వద్ద ఉన్న మేలురకం వజ్రాలు జాబితా రాసుకుని ఇయ్యండి," అని అడిగాడు. అలాగే అతను కొందరి దగ్గిర బంగారం కూడా పుచ్చుకున్నాడు. రాజుగారికి చాలా సన్నిహితుడు గనక అందరూ అతనికి లక్షలు విలువ చేసే వస్తువులను సంకోచించ కుండా ఇచ్చేసి, అతను తయారు చేసిన జాబితాల మీద సంతకాలు చేశారు.

మర్నాడు తెల్లవారే సరికి, క్రితం రాత్రి శ్రీకంఠుడు నగరం నుంచి పరారీ అయినట్టు పుకారు పుట్టి నగరమంతా పాకింది. కిందటి రోజు అతనికి వజ్రాలూ, బంగారమూ ఇచ్చిన వాళ్ళందరూ జాబితాలతో సహా రాజు వద్దకు వెళ్ళి, "రక్షించండి, మహా ప్రభో! మీ అంతరంగికుడు మీ పేరుచెప్పి, మమ్మల్ని దోచేశాడు. ధర్మ ప్రభువులు, తమరు మాకు కలిగిన నష్టానికి పరిహారం



ఇవ్వటం న్యాయం," అని మొరపెట్టు కున్నారు.

శ్రీకంఠుణ్ణి వజ్రాలూ, బంగార మూ వసూలు చెయ్యమని తాను నియోగించ లేదు గనక, అతను ధనికులను లూటీ చేసి పారిపోయి ఉంటాడని నమ్మి రాజు కోశాధి కారిని పిలిచి, ఎవరెవరికి ఎంత పరిహారం ఇవ్వాలో లెక్కలు కట్టమన్నాడు.

కోశాధికారి అందరి జాబితాలూ తీసు కుని లెక్కకట్టితే, వారికి పరిహారం ఇవ్వ వలిసిన మొత్తం ఖజానాలోనే లేదు. ఈ మాట విని రాజు కుంగిపోయాడు.

ఇంతలో శ్రీకంఠుడు అక్కడికి ఒక పెద్ద సంచీతో వచ్చాడు. అతను ఆ సంచీని రాజుగారి ముందుంచి, ఆయనకు ఒక జాబితా కూడా ఇచ్చి, "ఎవరెవరి దగ్గిర నేను ఏ మేమి తీసుకున్నదీ జాబితా రాశాను. దాని ప్రకారం ఎవరి సొత్తు వారికి తిరిగి ఇప్పించండి," అన్నాడు.

శ్రీకంఠుణ్ణి చూడగానే ఫిర్యాదీలకు ముచ్చెమటలు పోశాయి. రాజు ఇంకా ఏమీ అనక ముందే వాళ్ళు రాజు ముందు సాష్టాంగపడి, "మహారాజా మేము సమ ర్పించిన జాబితాలు సక్రమంగా లేకపోతే క్షమించండి. అంతరంగికుడుగారు పరారీ అయారని విని, లోభబుద్ధితో జాబితాలు పెంచాము," అన్నారు.

రాజు వారి సొత్తు వారికి ఇయ్యటానికి నిరాకరించి, వాళ్ళను పంపేసి, శ్రీకంఠుడు తెచ్చిన సంచిని కోశాధికారి పరంచేసి, ఖజా నాలో చేర్చమన్నాడు.

తరవాత ఆయన శ్రీకంఠుడితో, "నీ గ్రంథంలో అబద్ధం అంటూ ఏమీ లేదని నిరూపించటానికి చాలా శ్రమ పడ్డావు," అన్నాడు.

"గొప్పవాళ్ళను గురించి నిజం రాయ టానికి ఇలాటి పాట్లు చాలాపడాలి, మహా రాజా. ఇదికూడా ఒక కళ," అన్నాడు శ్రీకంఠుడు.

తరవాత అతను పురందరుడి వద్ద గొప్ప సన్మానమూ, అంతులేని బహుమానాలూ పొంది మరొక దేశానికి వెళ్ళిపోయాడు.





# మహాభారతం

మొట్టమొదటగా యుద్ధానికి తలపడిన వాడు భీముడు. అతను భయంకరమైన సింహనాదం చేసి కౌరవసేన మీదికి వచ్చాడు. అతన్ని దుర్యోధన, దుశ్శాసన, దుర్ముఖ, దుస్సహాదులు అనేకమంది చుట్టుముట్టారు. వాళ్ళ సందరినీ ఉప పాండవులూ, అభిమన్యుడూ, నకుల సహదేవులూ, ధృష్టద్యుమ్నుడూ మొదలైన వాళ్ళు ఎదుర్కొన్నారు. ఇలా ఆరంభమైన యుద్ధం అన్ని రంగాలకూ వ్యాపించింది.

మొట్ట మొదటగా ద్వంద్వ యుద్ధం భీష్ముడికీ, అర్జునుడికీ మధ్య జరిగింది. ఎవరూ ఎవరికీ తీసిపోకుండా యుద్ధం చేశారు. ఆ వెంటనే సాత్యకి కృతవర్మతోనూ, అభిమన్యుడు బృహద్బలుడి (కోసలరాజు) తోనూ, భీముడు దుర్యోధనుడితోనూ, దుశ్శాసనుడు నకులుడితోనూ, దుర్ముఖుడు సహదేవుడితోనూ, ధర్మరాజు శల్యుడితోనూ, ధృష్టద్యుమ్నుడు ద్రోణుడితోనూ, ధృష్టకేతువు బాహ్లికుడితోనూ, ఘటోత్కచుడు అలంబుసుడితోనూ, శిఖండి అశ్వత్థామతోనూ, విరాటుడు భగదత్తుడితోనూ, ద్రుపదుడు సైంధవుడితోనూ ద్వంద్వయుద్ధాలు చేశారు. ఎవరూ ఓడలేదు.

బొమ్మయుద్ధం కూడా విస్తారంగా జరిగింది. మొత్తం యుద్ధంలో భీష్ముడు వీరవిహారం చేసి, అందరికన్న ఎక్కువగా రాణించాడు. మిట్టమధ్యాహ్నం కావస్తూ ఉండగా ఆయన పాండవసేనలో జొర

54. శ్వేతుడి మరణం



బద్ధాడు. ఆయన వెంట రక్షకులుగా దుర్ముఖుడూ, కృతవర్మా, కృపుడూ, శల్యుడూ, వివింశతీ ఉన్నారు. భీష్ముడు తమసేనను నాశనం చేస్తూ రావడం చూసి అభిమన్యుడు అలిగి, భీష్ముడిపై తలపడి, భీష్ముడి జండా పడగొట్టి, భీష్ముడి వెంట ఉన్న యోధులందరి తోనూ భయంకరంగా యుద్ధంచేసి, అపర అర్జును డనిపించాడు. త్వరలోనే అభిమన్యుడికి అండగా భీముడూ, విరాటుడూ, అతని కొడుకులూ, సాత్యకీ, ధృష్టద్యుమ్నుడు మొదలైనవారు పది మంది యోధులు వచ్చారు.

ఉత్తరుడు ఒక ఏనుగు నెక్కి శల్యుడి మీదికి వచ్చాడు. ఇద్దరికీ జరిగిన యుద్ధంలో ఉత్తరుడు దెబ్బతిని పడిపోయాడు. అది చూసి ఉత్తరుడి అన్న అయిన శ్వేతుడు ఒకే సారి ఏడుగురు కౌరవ యోధులను ఎదుర్కొని, భయంకరమైన యుద్ధం చేశాడు. ఆ యుద్ధంలో శల్యుడికి వెంట్రుకవాసిలో చావు తప్పింది. అయితే శ్వేతుణ్ణి భీష్ముడి నుంచి కాపాడటానికి పాండవ యోధులు గొప్ప ప్రయత్నం చేశారు. దీని ఫలితంగా ఉభయ పక్షాల యోధుల మధ్య తీవ్రమైన దొమ్మియుద్ధం జరిగింది. మిగిలిన కౌరవ యోధులను పారిపోగొట్టిన శ్వేతుడు భీష్ముడికి ఎదురుగా నిలిచి గొప్ప యుద్ధం చేశాడు. శ్వేతుడు ఆ సమయంలో అడ్డుపడక పోతే భీష్ముడు పాండవ సేనను విపరీతంగా ధ్వంసం చేసి ఉండేవాడు. అతను భీష్ముడితో యుద్ధం చెయ్యటమే గాక, భీష్ముడు వెనక్కు తిరిగిపోయేటట్టు కూడా చేశాడు. పాండవులు హర్షధ్వానాలు చేశారు.

భీష్ముడు వెనక్కు తగ్గగానే శ్వేతుడు ధృతరాష్ట్రుడి కొడుకులున్న చోటికి వచ్చాడు. అతను కౌరవసేనను ధ్వంసం చేస్తూ ఉండటం చూసి భీష్ముడు మళ్ళీ అతన్ని ఎదుర్కొన్నాడు. భీష్ముడికి అండగా, ఎనిమిది మంది కౌరవ యోధులు వచ్చి శ్వేతుడిపై బాణవర్షం కురిపించారు. శ్వేతుడు అంత మందినీ ప్రతిఘటించి పోరాడుతూ, భీష్ముడికి చెయ్యీ, కాలూ

ఆడకుండా చేశాడు. చూసేవారికి భీష్ముడు ఓడిపోతాడనే అనిపించింది. వారిద్దరి మధ్యా జరిగిన యుద్ధంలో శ్వేతుడి రథం ధ్వంసం అయింది. భీష్ముణ్ణి చంపటానికి గద తీసుకుని శ్వేతుడు అతని రథం మీదికి వచ్చాడు. అతను విసిరిన ఆ గదతో భీష్ముడి రథం చూర్ణమయింది. కాని అలా అవుతుందని తెలిసి భీష్ముడు ముందుగానే రథం దిగి, మరొక రథం మీద ఎక్కి శ్వేతుడి పైకి వచ్చాడు.

శ్వేతుడు రథం పోగొట్టుకుని నేల మీద నిలబడి ఉండటం చూసి సాత్యకీ, భీముడూ, అభిమన్యుడూ మొదలైన అనేక మంది యోధులు అతనికి అండగా వచ్చారు. అయితే భీష్ముడు వారినందరినీ దూరానే నిలవగొట్టాడు. తరవాత భీష్ముడు ప్రయోగించిన ఒక్క బాణం శ్వేతుడి ప్రాణాలు లాగేసింది. మహారథుడూ, పాండవ సేనాపతులలో ఒకడూ అయిన శ్వేతుడి మరణం పాండవులకు తీరని దుఃఖమూ, కౌరవులకు అమితానందం కలిగించింది.

శ్వేతుడు చావగానే అతని తమ్ముడు శంఖుడనే వాడు మండిపడి, కృతవర్మ వెంట ఉన్న శల్యుడిపైకి యుద్ధానికి వచ్చాడు. ఏడుగురు కౌరవ యోధులు శల్యుడికి అండగా వచ్చారు. శంఖుడి పైకి భీష్ముడు మృత్యు దేవతలాగా వచ్చిపడ్డాడు. అర్జునుడు శంఖుడికి తోడువచ్చాడు. శల్యుడు శంఖుడి రథాన్ని విరగగొట్టేసరికి శంఖుడు అర్జునుడి రథం ఎక్కాడు.





భీష్ముడు అర్జునుణ్ణి విడిచిపెట్టి ద్రుపదుడి పైకి వెళ్ళి, ద్రుపదుడి సేనను కార్చిచ్చులాగా తన బాణాలతో నాశనం చేయసాగాడు. ఆ సమయంలో భీష్ముణ్ణి చూసి పాండవ వీరులు వణికిపోయారు. ఆయనను నిరోధించటం వారికి సాధ్యం కాలేదు.

అంతలో సూర్యాస్తమానమయింది. ఉభయపక్షాల వారూ యుద్ధం చాలించి తమ తమ శిబిరాలకు వెళ్ళిపోయారు. భీష్ముడు చేసిన దారుణ యుద్ధానికి దుర్యోధనుడు పరమానందం చెందాడు. కాని ధర్మరాజు మొదటి రోజు తమకు కలిగిన నష్టానికి విచారిస్తూ కృష్ణుడి వద్దకు వెళ్ళి,

"భీష్ముడెంత యుద్ధం చేశాడు! మన సేనను ఎండుగడ్డిని దహించినట్టు ధ్వంసం చేశాడు గదా! భీష్ముణ్ణి జయించటం ఎవరివల్ల అవుతుంది? ఆయనను ఎదిరించటం నాదే బుద్ధి తక్కువ. కృష్ణా, అరణ్యాలకు పోయి సుఖంగా బతుకుతాను. ఈ రాజులందరికీ చావు తప్పించిన వాణ్ణి అవుతాను. రాజ్యకాంక్ష నన్ను దుస్థితికి తెచ్చింది. నా తమ్ములందరూ గాయపడ్డారు. బతికి ఉన్నంత కాలమూ తపస్సు చేసుకుంటాను. నాకు కర్తవ్యం ఏమిటో వెంటనే చెప్పు. యుద్ధంలో అర్జునుడు తటస్థంగా ఉంటున్నాడు. భీముడొక్కడే తెగబడి యుద్ధం చేస్తున్నాడు. భీష్ముడి చేతిలో మా కందరికీ చావు రాసిపెట్టి ఉన్నది," అని శోకంలో మతి చెడి మాట్లాడాడు.

కృష్ణుడు ధర్మరాజును ఓదార్చుతూ, "నువు ఇలా దిగులు పడటం భావ్యం కాదు. నీ తమ్ములు త్రిలోక శూరులు. సాత్యకీ, విరాటుడూ, ద్రుపదుడూ, ధృష్టద్యుమ్నుడూ లాంటి మహారథులు అనేక మంది నీకు అండగా ఉన్నారు. నీకు విచారం దేనికి? శిఖండి భీష్ముణ్ణి చంపటానికి పుట్టినవాడే గద!" అన్నాడు.

అప్పుడు ధర్మరాజు ధృష్టద్యుమ్నుడితో, "నిన్ను సేనాపతిగా చేయమని కృష్ణుడు



మమ్మల్ని ఆదేశించాడు. అందుచేత నువ్వు కౌరవ సేనలను సంహరించాలి. నీ వెనక మేమంతా ఉంటాము," అన్నాడు.

దానికి ధృష్టద్యుమ్నుడు, "రాజా, నేను ద్రోణుణ్ణి చంపటానికి పుట్టిన వాణ్ణి. భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కృపుణ్ణీ, శల్యుణ్ణీ, మిగిలిన అందరు యోధులనూ నేను ఎదుర్కొంటాను," అన్నాడు.

"క్రౌంచవ్యూహం శత్రువులను నాశనం చేస్తుందట. దేవాసుర యుద్ధమప్పుడు ఇంద్రుడికి బృహస్పతి ఆ వ్యూహం చెప్పాడట. అది అందరికీ తెలియదు. రేపు మన సేనను క్రౌంచవ్యూహంలో నిలబెట్టు," అన్నాడు ధర్మరాజు.

మర్నాడు తెల్లవారింది. రెండో రోజు యుద్ధానికి పాండవసేన క్రౌంచవ్యూహంలో నిర్మించబడింది. దానికి ముందు ఈ రోజు అర్జునుడు నిలిచాడు. ఈ వ్యూహానికి తల వద్ద ద్రుపదుడు తన సేనలతో నిలిచాడు. ధర్మరాజు తోకవద్దా భీమ ధృష్టద్యుమ్నులు రెక్కల స్థానంలోనూ ఉన్నారు. సూర్యోదయం కాక పూర్వమే వ్యూహం తయారై, యుద్ధానికి సిద్ధమయింది.

పాండవ సేన క్రౌంచవ్యూహంలో ఉండటం చూసి, భీష్మ ద్రోణులూ, దుర్యోధనాదులూ కలిసి తమ సేనకు ప్రతి వ్యూహం పన్నారు. అందులో వివిధ యోధులు వేరు వేరు స్థానాలలో ఉన్నారు. ఉభయసేనలూ పెళ్ళికి పోతున్నట్టుగా మహోత్సాహంతో శంఖాలూ, భేరీలూ మోగించి, యుద్ధానికి తలపడ్డాయి.

యుద్ధం ఆరంభమవుతూనే భీష్ముడు, అభిమన్యుడూ, భీముడూ, అర్జునుడూ, విరాటుడూ, ధృష్టద్యుమ్నుడూ మొదలైన పాండవ పక్ష యోధుల మీద బాణ వర్షం కురిపించాడు. పాండవవ్యూహం చెదిరిపోసాగింది. అర్జునుడు మండిపడి, తన రథాన్ని భీష్ముడి కేసి నడపమని కృష్ణుడితో చెప్పాడు. అతను భీష్ముణ్ణి చంప నిశ్చయించాడు. కపిధ్వజమూ, అనేక పతాకలూ కలిగిన అర్జునుడి రథం భీష్ముడి కేసి

పోతూంటే, దారిలో అంతులేని కౌరవ సేనను అర్జునుడు చంపాడు.

అది చూసి భీష్ముడు అర్జునుడికి ఎదురు వచ్చాడు. ఆయన వెంట రక్షకులుగా సైంధవుడు మొదలైన వీరులు అనేక మంది వచ్చారు. అర్జునుడి మీద భీష్ముడితో పాటు ద్రోణుడూ, కృపుడూ, దుర్యోధనుడూ, శల్యుడూ, అశ్వత్థామా, వికర్ణుడూ కూడా బాణాలు వేశారు. బాణాల దెబ్బలు తిని కూడా చలించక అర్జునుడు తిరిగి అందరినీ తన బాణాలతో నొప్పించాడు. అర్జునుడికి సహాయంగా సాత్యకీ, విరాటుడూ, ధృష్టద్యుమ్నుడూ, ఉప పాండవులూ, అభిమన్యుడూ యుద్ధంలోకి వచ్చారు. ద్రోణుణ్ణి అర్జునుడి నుంచి తప్పించటానికి ద్రుపదుడు ఆయన మీదికి వెళ్ళాడు.

అప్పుడు దుర్యోధనుడు భీష్ముడి వద్దకు వెళ్ళి, "తాతా, అర్జునుడు మన సేనలను ధ్వంసం చేస్తున్నాడు. నీ మూలంగా కర్ణుడు అస్త్రం పట్టనని శపథం చేశాడు గద! అతను ఉంటే బాగుండేది, కాని లేడు గనక ఈ అర్జునుణ్ణి చంపే మార్గం నువే చూడు," అన్నాడు.

దుర్యోధనుడు ఇలా అనగానే భీష్ముడు రోతపడుతూ, "ఛీ, ఛీ! ఏం క్షత్రియ ధర్మం!" అని అర్జునుడి రథాన్ని సమీపించాడు. వెంటనే భీష్ముడికి అండగా



కౌరవ వీరులూ, అర్జునుడికి అండగా పాండవ వీరులూ కూడారు. భీష్మార్జునుల మధ్య యుద్ధం ఆరంభమయింది. ఇద్దరూ మంచి యుద్ధోత్సాహంలో ఉన్నారు; ఒకరి బాణాల నుంచి మరొకరు తనను తాను కాపాడుకుంటూ ఇద్దరూ సమంగా యుద్ధం చేశారు. ఈ యుద్ధంలో ఇద్దరి రథాలూ, గుర్రాలూ, సారథులూ గాయపడ్డారు. కృష్ణుడికి మూడు బాణాలు తగిలి రక్తం కారసాగింది. భీష్ముడు చేసిన ఈ పనికి ఆగ్రహించి అర్జుడు భీష్ముడి సారథిని కూడా మూడు బాణాలతో కొట్టాడు. ఆ యుద్ధంలో భీష్ముడు అర్జునుణ్ణిగాని, అర్జునుడు భీష్ముణ్ణిగాని జయించ లేదు.

ఈ సమయంలో ఇతర ద్వంద్వ యుద్ధాలు సాగాయి. ద్రోణుడికీ, ధృష్టద్యుమ్నుడికీ ఘోరమైన యుద్ధం జరిగింది. ధృష్టద్యుమ్నుడి విజృంభణచూసి పాండవ వీరులు ఉత్సాహంతో సింహనాదాలు చేశారు. కాని చివరకు ధృష్టద్యుమ్నుడు తన బాణాన్నీ, రథాన్నీ పోగొట్టుకుని, కవచం తూట్లుపడి, ద్రోణుడి బాణాల తాకిడికి గురి అవుతూ ఉన్నస్థితిలో భీముడు సింహనాదం చేస్తూ వచ్చి అతన్ని కాపాడి, ద్రోణుడితో యుద్ధం ఆరంభించాడు.

దుర్యోధనుడు భీముడి పైకి కాళింగుణ్ణీ, అతని సేననూ పంపాడు. ద్రోణుడు భీముణ్ణి వదిలి, విరాట ద్రుపదులతో యుద్ధం చేయబోయాడు. ధృష్టద్యుమ్నుడు ధర్మరాజు వద్దకు మరొక రథంలో వెళ్ళాడు. భీముడు తనపైకి వచ్చిన కాళింగుడి సేనలతో పోరాడి, కాళింగుడి కొడుకులైన శక్రదేవుణ్ణీ, భానుమంతుణ్ణి, శ్రుతాయుషు డనే కాళింగుణ్ణీ చంపి, కాళింగుడి సేనమధ్యపడి భీభత్సంగా చంపసాగాడు. అది చూసి ధృష్టద్యుమ్నుడు ఉత్సాహం పొంది, సింహనాదం చేసి, భీముడికి సహాయంగా వచ్చాడు. ఆ సమయంలో భీముడు యముడి లాగా ఉన్నాడు గాని మనిషిలాగా లేడు.

సేనలలో కోలాహలం విని భీష్ముడు వేగంగా అక్కడికి వచ్చాడు. ఆయన మీద సాత్యకీ, భీముడూ, ధృష్టద్యుమ్నుడూ కలియబడ్డారు. భీష్ముడు ముగ్గురితోనూ తీవ్రంగా యుద్ధం చేశాడు. భీముడి రథాశ్వాలు చచ్చాయి. భీముణ్ణి ధృష్టద్యుమ్నుడు తన రథం మీద ఎక్కించుకుని అవతలికి తీసుకు పోవలసి వచ్చింది. భీముడికి సంతోషం కలగ గలందులకు సాత్యకి భీష్ముడి సారథిని తన బాణాలతో చంపేశాడు. గుర్రాలు భీష్ముడి రథాన్ని ఎటో ఈడ్చుకుపోయాయి. తరవాత సాత్యకి భీముడి వద్దకు వచ్చి, అతని భుజం తట్టి, "ఆహా, భీమసేనా! ఏమి నీ ప్రతాపం! కాళింగుణ్ణీ, అతని కొడుకులనూ నువు ఒక్కడివే చంపావు గద!" అంటూ కౌగలించుకుని ప్రోత్సహించాడు.






## 3

దమనకం చెప్పిన నక్క కథ విని సింహ రాజు పింగళకం, "కాని మన పరివార మంతా భీతిచెంది, అరణ్యం నుండి పారి పోవాలనుకుంటున్నారు," అన్నది.

"స్వామీ, అది వారి తప్పు కాదు. రాజును బట్టే ప్రజలు. మీరు ధైర్యం వహించి ఇక్కడే ఉన్నట్టయితే నేను వెళ్ళి, ఆ భయంకరమైన రంకె వేసిన ప్రాణియొక్క తత్వం తెలుసుకుని వస్తాను. ఆ తరవాత తమ చిత్తం," అన్నది దమనకం.

"వెళ్ళి కనుక్కురా. అయితే నీకు అక్కడికి వెళ్ళే ధైర్యం ఉన్నదా?" అని పింగళకం అడిగింది.

"యజమాని ఆనతిస్తే మంచి సేవకుడైనవాడు సంశయిస్తాడా? సముద్రాలలో దూకుతాడు, అగ్నిలో చొరబడతాడు!" అన్నది దమనకం.

"అయితే వెళ్ళిరా! శుభమస్తు!" అన్నది పింగళకం.

దమనకం సింహానికి నమస్కరించి, రంకె వినిపించిన యమునానది దిక్కుగా బయలుదేరింది.

పింగళకం ఇలా ఆలోచించింది: "నేను నా భయాన్ని వీడికి తెలియనివ్వటం పొరపాటయిందా? వీడు వెళ్ళి ఆ భయంకర మృగాన్ని తెచ్చి, మోసంతో నన్ను చంపించడు గద? ఆశ్రయం లభించని సేవకులు ఎంత పని అయినా చేస్తారు. నేను మరెక్కడైనా వేచి ఉంటాను."

ఇలా అనుకుని పింగళకం ఆత్మరక్షణకు అనువైన చోటికి వెళ్ళి, "నమ్మిన బలవంతుడు బలహీనుడికి కూడా ఓడుతాడు; జాగ్రత్త గల బలహీనుడు బలవంతుడికి కూడా లొంగడు," అనుకున్నది.

అట్ట చివరి బొమ్మ

ఈ లోపల దమనకం వెళ్ళి, రంకెలు పెడుతున్న సంజీవకాన్ని చూసి, అది మామూలు ఎద్దేనని తెలుసుకుని ఆశ్చర్య పోయింది. పింగళకానికి గల భయాందోళనలు ఆధారం చేసుకుని దాన్ని తన అధీనంలో ఉంచుకోవటం తేలిక అని అది అనుకున్నది. భృత్యులు తమ యజమానికి క్లిష్టసమస్యలు కలగాలని కోరుకుంటారు. ఎందుకంటే వాటిని పరిష్కరించే మిష మీద తాము లాభం పొందవచ్చు. ఏ సమస్యలూ లేని రాజులకు మంత్రాలోచన చేసే వారితో ఏం పని? ఆరోగ్యవంతుడికి వైద్యులూ, ఔషధాలూ ఎందుకూ? దమనకం పింగళకం వద్దకు తిరిగి వెళ్ళింది.

"ఏంరా, అబ్బీ? ఆ భయంకర మృగాన్ని చూశావా?" అని పింగళకం అడిగింది.

"తమ దయవల్ల చూశాను. చూసి ఆ మృగంతో తమ బలపరాక్రమాలను గురించి చెప్పాను; తమకు జోహారులర్పించమన్నాను. నేను వెళ్ళి, అతన్ని తమ సన్నిధికి తెచ్చి, తమకు పాదాక్రాంతుడు చేస్తాను," అన్నది దమనకం.

పింగళకం ఈ మాట విని అమితానందం చెంది, "వెళ్ళు. వెంటనే అతగాణ్ణి తీసుకు రా!" అన్నది.

దమనకం సంజీవకం వద్దకు వెళ్ళి, "ఇలా రా, తెంపరి ఎద్దూ. ఇంత అమర్యాదగా, మాకు చిరాకు కలిగిస్తూ, ఈ నది ఒడ్డున ఎందుకు రంకెలు



పెడుతున్నావో మా రాజు పింగళకంగారు తెలుసుకో గోరుతున్నారు," అన్నది.

"బాబ్బాబు! ఎవరు నువు చెప్పే ఈ పింగళకం?" అన్నది సంజీవకం.

"ఏమిటీ? మా రాజు పింగళకాన్నే ఎరగవుగా! చెబితే గడగడలాడి పోతావు. ఆయన ఒక గొప్ప సింహం. వన రాజు. అన్ని జంతువులూ ఆయన పరివారం. ఆయన పెద్ద మర్రిచెట్టు కింద కొలువు తీరి ఉంటారు. ఈ అరణ్యంలో ఉండే సమస్త ప్రాణులకూ ఆయన యజమాని," అన్నది దమనకం.

ఈ మాటలు విని సంజీవకం భయపడి దమనకంతో, "బాబ్బాబు! నువు మంచి వాడివి లాగున్నావు. నన్ను వారి దగ్గికిరి తీసుకుపోవలిసే ఉంటే ముందుగా వారి నుంచి నాకు అభయం ఇప్పించు," అన్నది.

"నీ కోరిక సబబుగానే ఉన్నది. రాజుల చిత్తం అగాధం. నువు ఇక్కడే ఉండు," అని దమనకం పింగళకం వద్దకు పోయి, "మహారాజా, ఆ జంతువు సామాన్యుడు కాడు. సాక్షాత్తూ శివుడి వాహనమట. శివానుజ్ఞతో ఈ వనంలో మేత మేస్తున్నట్టు చెప్పాడు," అన్నది.

పింగళకం ఈ మాట విని దడుచుకుని, "నాకు ముందే తెలుసురా, అబ్బీ! ఈశ్వరుడి అనుమతి లేకుండా ఈ వనంలో స్వేచ్ఛగా తిరుగుతూ, భయంకరంగా రంకెలు పెట్టజాలరు. ఇంతకూ నువు అతనితో ఏమన్నావు?" అన్నది.



"'మా రాజు సాక్షాత్తూ పార్వతీదేవి వాహనం. పార్వతీదేవే మా రాజుకు ఈ వనాన్ని ఇచ్చింది. నువు ఇక్కడికి అభ్యాగతిగా వచ్చినవాడివి. అందుచేత నువు మా రాజును కలుసుకుని, వారితో సంధి చేసుకుని, సఖ్యంగా తిను, తాగు, తిరుగు, ఆడు; వారి అనుమతితో జీవించు,' అన్నాను. అందుకు అతను ఒప్పుకుని తమ వద్ద నుండి అభయం తెమ్మన్నాడు. ఇస్తారో, ఇయ్యరో అది తమ ఇష్టం," అన్నది దమనకం.

ఈ మాటకు పింగళకం మహా సంతోషపడిపోయి, "భేష్ రా, అబ్బీ! భేష్! అతడికి అభయం ఇచ్చాను, వెళ్ళి పిలుచుకు రా!" అన్నది.

సంజీవకాన్ని తీసుకురావటానికి వెళ్ళేటప్పుడు దమనకం హృదయం ఆనందంతో పొంగిపోయింది. రాజుకు తనపై అనుగ్రహం కలిగింది. రాజానుగ్రహం పాయసంలాటిది; చలిలో కుంపటిలాటిది; ఆప్తులను కలుసుకోవటంలాటిది.

దమనకం సంజీవకాన్ని చేరుకుని, "మిత్రమా, నీ యెడ మా రాజు అనుగ్రహం సాధించాను. ఆయన నీకు అభయం ఇచ్చారు. నువ్వీక నిశ్శంకగా నా వెంట రావచ్చు. కాని గుర్తుంచుకో, నీకు రాజానుగ్రహం సంపాదించినది నేను. నువు నా చెప్పు చేతలలో ఉండాలి. రాజుకు ఆత్మీయుణ్ణి అని విర్రవీగక, పరిపాలన అంతా నా చేతి మీదుగా జరగనీ. అలాచేస్తే ఇద్దరికీ సుఖం ఉంటుంది. ఒకడు వేట మృగాన్ని కదిలిస్తాడు, రెండోవాడు దాన్ని కొట్టుతాడు; ఇద్దరూ కలిసి దాన్ని పంచుకుంటారు. అది వేట ధర్మం. అదీకాక, నువు నాకు అసంతృప్తి కలిగించావంటే నశిస్తావు. రాజభృత్యులను సంతోషపెట్టని వాళ్ళు వెనకటికి దంతిలుడి లాగా భంగపాటు చెందుతారు," అన్నది.

"అదెలాగా?" అని సంజీవకం దమనకాన్ని అడిగింది.

దమనకం దంతిలుడి కథ చెప్పనారంభించింది.



# 141. ప్రాచీన చిత్రం

క్రీస్తు పూర్వం 1495 సంవత్సరంలో ఈజిప్టురాణి హట్సెప్సూట్ సాంబ్రాణి చెట్లను సమూలంగా దేశాంతరాల నుంచి తెప్పించి తన తోటలో నాటించింది. ఈ చెట్లు బుట్టలలోనూ, గోనెలలోనూ పెట్టి, నౌకల మీద తెచ్చారు. తిబిస్ వద్ద ఈ రాణి నిర్మించిన ఆలయంలో ఈ దృశ్యం క్రి. పూ. 1487 ప్రాంతాల చిత్రించ బడింది. అంటే ఇది 3460 ఏళ్ళనాటి చిత్రం!



Photo by P. Subhash Varma



బహుమతి
పొందిన వ్యాఖ్య

సిక్కును నేను

పంపినవారు:
ఎం. శ్యామల

Photo by R. P. Ram



251. మారేడుపల్లి,
సికింద్రాబాదు.

భిక్కు నౌతాను

బహుమతి
పొందినవ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు



★



★ వ్యాఖ్యలు సెప్టెంబర్ నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు నవంబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
బౌద్ధాలయారామం

మూడవ అట్ట:
ఆరామంలో బుద్ధుడు


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26


AMRUTANJAN
Pain Balm
Amrutanjan Ltd.

విపరీతమైన జలుబు
తక్షణం తగ్గిపోయింది!

AM/7570

# అమృతాంజనం

తలనొప్పి, జలుబు, ఇతర బాధలను నిరపాయంగా చప్పున పోగొడుతుంది

జలుబులు, వళ్ళునొప్పి, కండరాల నొప్పి, బెణుకులు, తలనొప్పి—చప్పున తగ్గాలంటే అమృతాంజనం వాడండి. బాధగా వున్నచోట అమృతాంజనం రాయండి. తక్షణం బాధ మాయమవుతుంది. అమృతాంజనం చిన్న సీసాలలోనూ, ఆదాచేసే పెద్ద సీసాలలోనూ, తక్కువ ధరకి లభించే చిన్న డబ్బాలలోనూకూడా దొరుకుతోంది.

అమృతాంజనం 10 ఔషధాలు కలిసినది. అమృతాంజన్ లిమిటెడ్

CHANDAMAMA ( Telugu )    SEPTEMBER 1973    Regd. No. M. 4854




మిత్రభేదం